# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

సెప్టెంబరు 1976

సంపుటము : 53 సంచిక : 9

విడిప్రతిక వెల రూపాయిన్నర

# భూమి గుండ్రంగా వుందా, చతురస్రంగా వుందా?

అభ్యుదయ వాదులు భూమి గుండ్రంగా వుందన్నారు

సంఘ వ్యతిరేక శక్తులు చతురస్రంగా వుందన్నారు

ఎవరి మాట నమ్మేది మనం!

ఇంతలో 20 సూత్రాల పథకం వచ్చి రూపం ఎలా వున్నా భూమి మీద హక్కు, అనుభవమూ అందరికీ వుండాలన్నది.

భూస్వాములనీ, భూమి లేని పేదలనీ వ్యత్యాసం యిక తగ్గిపోతుంది. మన రాష్ట్రంలో భూ సంస్కరణల ఉద్యమం వేగంగా జరుగుతున్నది. ఇప్పటికే 22 లక్షల ఎకరాల మిగులు భూమి పేదవారికి పంచారు.

దేశంలో అదనంగా 50 లక్షల హెక్టార్ల భూమిని సాగులోకి తేవాలని ప్రధాని ప్రకటించారు. మన రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యాలు విస్తరించి మరో 7 లక్షల హెక్టార్లకు పైగా సాగుచేసే ప్రయత్నం జరుగుతున్నది.

వ్యవసాయ కార్మికుల కష్టాలు గట్టెక్కాయి. వారే రైతులై పంటలు పండించే శుభదినాలు వచ్చాయి. స్వంత భూమి సేద్యం చేసుకునేందుకు ఋణాలు యిస్తారు. అన్ని సౌకర్యాలు కల్పిస్తారు.

సమాచార పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

9/76/తెలుగు

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1976





# విశ్వమానవుల వీధి అరుగు

శ్రీ పిరియాల రామకృష్ణ

ఇంతకాలం ఫాలంమీద సమరాల మేకులు-గుచ్చుతుంటే
ఎంత నెత్తురు కారిపోయింది ?
సైన్యాల తుపాకీల తాకిడికి ఎన్ని తాళిబొట్లు
పుటుక్కుమని తెగిపోయి కన్నీళ్లలో మునిగిపోయాయి ?
ఎప్పటివాటో ఎందుకు ?
నిన్న మొన్న బంగ్లాదేశ్‌లో జరిగిందేమిటి?
వియత్నాంలో జరిగిందేమిటి?
ఇంకా వెనక్కు వెడితే ఇరాన్‌లో కాంగోలో క్యూబాలో ఇజ్రాయెల్‌లో
లావోస్‌లో కొరియాలో ఏం జరిగింది?
శాంతిదీపాలు ఆర్పేశారు!
తుపాకుల తుపానులు సృష్టించారు!
వేలతల్లుల గొంతుకల్లో నెత్తురు విషం పోశారు!
కన్నీళ్ల జీవనదుల్లో కలిపేశారు!
ఇంకా వెనక్కు వెడితే–
ఇథియోపియాలో స్పెయిన్‌లో జపాన్‌లో చైనాలో
రోమ్‌లో ఆస్ట్రియాలో చెకోస్లోవేకియాలో బొహీమియాలో
మొరేవియాలో ఆల్బేనియాలో
పోలెండ్, ఫిన్లెండ్, హాలెండ్‌ల్లో
నార్వే డెన్మార్క్ గ్రీస్ రష్యా బెల్జియంల్లో
రాబందులకు విందులు!
నక్కల నాట్యాలు!
మృత్యువు నృత్యాలు!
తుపాకుల తుమ్ములు! బాకుల పోటులు!
హిరోషిమా నాగసాకీల్లో
అటంబాంబులు ఆవులిస్తే
యమదూతలు పళ్లికిలిస్తే
కనిపించిందేమిటి ?
బూడిద కుప్ప!
ఆ భస్మసాగరంలో
ఎన్ని ఎముకలు, ఎన్ని కపాలాలు;
ఎన్ని అశ్రుధారలు, ఎన్ని అసృగ్ధారలు
మునిగిపోయాయో ?
మరీ ముందుకు వెడితే–
సెర్బియామీద ఆస్ట్రియా దాడిచేసినప్పుడు పుట్టిన భూకంపం
మనుష్యుల మనోవల్మీకాల్లో పడగెత్తిన క్రోధం
అవన్నీ ఇప్పుడెందుకులే ?
ఇంతకీ ప్రపంచాన్నంతటినీ
చితాభస్మ మహార్ణవంలో ముంచజూచిన
దానవులు వేరే ఎవరున్నారు?
మానవులు కాక ?

## జరీబట్టలు

అయ్యో మానవుడా !
వింతలు సృష్టించిన మానవుడా !
విజ్ఞానం తవ్వుకున్న మానవుడా !
అనంత విశ్వాంతరాళంలోకి పిక్‌నిక్‌లు చేసి
ముక్కంటి కళ్లలో ముత్యాల పందిళ్లలో
ఫొటోగ్రఫీ తీసే మానవుడా !
కోట్లు కోట్లు కరెన్సీతో మృత్యువుని ఆరాధించడానికి
పల్లకీలు నిర్మిస్తున్న మానవుడా !
వినాశనాల వీధుల్లో
వివేకాల మానభంగాలు చేస్తున్న మానవుడా!
మానవత్వపు జరీబట్టలు కట్టుకున్న దానవుడా !

## విలయాగ్ని నేత్రం

ఇంట్లో ఆల్మగల తగాదాలకి
ఆకళ్ల అవసరాలు 'కామాలు' పెడతాయి!
వీధిలో ఇరుగు పొరుగుల పోట్లాటలకి
కాలం 'సెమికోలన్లు' పెడుతుంది!
ఊళ్లో కులాల బలాల వైరాలకు
కోర్టులు 'ఫుల్‌స్టాపులు' పెడతాయి !
దేశంలో చెలరేగే అవినీతికి, అసమర్థతకి
అంతర్యుద్ధానికి అత్యవసర అనుశాసనాలు
ఫర్మానాలు జారీచేసి ఆజ్ఞానాలు విధిస్తాయి!

మరి, ఆరుఖండాలమధ్య ఆరువందల భాషలమధ్య
ఆరువేల జాతులమధ్య
పచ్చగడ్డి భగ్గుమంటే
అపార్థాల మంటలు లేస్తే
స్నేహాల వంతెనలు కూలిపోతే
అసూయల కార్మబ్బులరిస్తే
మార్గమేమిటి?

చూస్తూ ఊరుకుంటే చూరులంటుకుపోతాయి
తుపాకులు తుపానులు తెస్తాయి
విమానాలు విద్వేషం కురుస్తాయి
దౌర్జన్యాలు జన్యాలను పిలుస్తాయి
బాంబులు పాంబులై విలయాగ్ని నేత్రం తెరుస్తాయి
కరువుకాటకాలు సామాన్య ప్రజని కరుస్తాయి
బడికి సెలవు బంగారానికి కరువు
అంగారాల చెరువు శృంగారాల బరువు

## కంచుగోళ్ళ మంచుచెయ్యి

ప్రపంచంలో ఏదిశలో ఏదేశంలో ఏదివిలో
దురాక్రమణాల దురుద్దేశాల మోసాలు మోసులెత్తినా
వాటిని మొగ్గలోనే తుంచేసే
ఒక కంచుగోళ్ళ మంచుచెయ్యి కావాలి!

వెండిమబ్బుల స్వప్నాల స్వర్గాల రహదారుల్లో
కర్పూరపు రెక్కలు విప్పుకుని
కాలంబేలం కట్టుకుని
ఎగిరిపోతున్న శాంతి కపోతాన్ని
తన పొట్టలో పెట్టుకోవడానికి
విల్లెక్కుపెట్టే ఒక కిరాతుడి చెయ్యి పట్టుకుని
మంచితనపు మంచిగంధంతో
అతడ్ని పులకింపజేసే ఒక బుద్ధుడు కావాలి!
లేదా
చిటాట్నగాట్లు పెట్టే
తిరస్కారం కారం జల్లి
వెలివేసే ఉరితీసే
ఒక న్యాయాధిపతుల వేదికైనా కావాలి!

## సాంబ్రాణిపొగ

భూతాలూ దయ్యాలూ
రౌరవాది నరకాలూ శాపాలూ
మొదలయినవి భయాలు కావిప్పుడు!

పిడుగులూ వరదలూ
కరువులూ జబ్బులూ
ఇవికూడా ముప్పు తెచ్చేవి కావిప్పుడు!
ఒక దేశాన్ని తన గుప్పిట్లోకి
తెచ్చుకోవాలనే
అధికార గర్వపు జబ్బు
ఒక జాతిని తన ఉక్కుబూట్లకింద తొక్కాలనే
అహంభావపు కండూతి
ప్రపంచమంతటా వలసల్ని స్థాపించి
సామ్రాజ్యవాదానికి సాంబ్రాణిపొగ వెయ్యాలనే
గొంతెమ్మ కోరిక
ఇవీ
నన్ను దుస్స్వప్నంలోకి, మతిభ్రమలోకి
మరణభయంలోకి
అనుక్షణం, నిరంతరం, అనారతం తోస్తున్నాయి,

## పెద్ద అక్కబంతి

పెద్దఅక్కబంతి చేతిలోంచి జారిపోయి
రెండు బద్దలుగా చీలిపోయినట్లు
కలవచ్చింది నాకు!
కళ్ళు నులుముకుని మళ్ళీ చూశాను!
ఏముంది
ప్రపంచమంతా రెండు చెక్కలయిపోయింది
ఒకప్రక్క
యంత్రాల మంత్రాలు చదివే
పెట్టుబడిదారీ వ్యవస్థ
మరోప్రక్క
సామ్యవాదంకోసం సమరం సాగించే
కార్మికవ్యవస్థ
ఈ రెండింటికీమధ్య
బాంబుల వంతెనలు
తుపాకీల పుంతలు

టాంకుల ఆనకట్టలు
విస్తుపోయాను !

## పేవ్ మెంట్లు

ఏవో
పెద్ద పెద్ద కేకలు, ఘోషలు, నినాదాలు !
దద్దరిల్లిపోతోంది మనస్సు
"శాంతి, అభ్యుదయం,
సౌభ్రాత్రం, స్వాతంత్ర్యం"
"ప్రపంచ కార్మికులారా ఏకం కండి !"
"విప్లవం వర్ధిల్లాలి !"

ఇలాగే ఏవో వినిపిస్తున్నాయి !
కొన్ని నినాదాలు పడమరనుంచి వీస్తున్నాయి
అస్త్ర యంత్రాల మంత్రాలు
తూర్పునుంచి మరికొన్ని నినాదాలు లేస్తున్నాయి
ఇవన్నీ మానవగళాల గానాలు
ఇందులో ఏ దిక్కు మనకి దిక్కు
ఎవరిపనులు వారికి న్యాయాల గనులే !
కాని
వాళ్ళూ వీళ్ళూ
అప్పుడప్పుడు ఇచ్చే స్టేట్‌మెంట్లు
యుద్ధాలకు పేవ్‌మెంట్లు !

## పవాళ్ళ వలత్రాళ్ళు

తీరని ఆశలు
అవేవో కందిరీగల్లా
తన మనస్సులో గింగిర్లు పోతూంటే
ఒక తుంటరి నిష్కారణంగా
మంచితనం మీద విరుచుకుపడతాడు !
దొంగ తిరుగుబాట్ల బొంగరాలు త్రిప్పుతాడు !
పవాళ్ళ వల త్రాళ్ళు విసురుతాడు !
కృతఘ్నతల మృతసర్పాల్ని మెడమీద పెడతాడు !
ఒక చేత్తో స్వాగత మిస్తాడు
ఒక చేత్తో కత్తి దూస్తాడు
ఇలాంటి వాణ్ణే తుపాకిస్తాన్ అంటాం
పిల్లాగో అష్టకష్టాలూపడి
అంతా అవుననిపించుకుంటాడు
హవ్వా ! కాల ప్రభావం !

## త్రాచుపాములు

ఇంకోడు
పంచశీల కంచంలో అన్నంతిని
అందులోనే ఇంత విషం కక్కేస్తాడు !
శాంతియుత సహజీవన శారదకు
మసిబొగ్గుతో
మీసాలు, మెల్లకళ్ళు దిద్దుతాడు !
చలిమంటలతో పోరాటం మొదలెడతాడు !
మనస్సులో చాలా మంటలు
మనుగడల్ని మండించడానికి !
తుపాకి గొట్టంలోంచే స్వేచ్ఛ వస్తుందంటాడు
నిరాయుధీకరణం ఒక బూటకం
శిఖరాగ్ర సమావేశం ఒక నాటకం
శాంతికోసం సాగించే ప్రయత్నాల
ప్రచారాల బిచానా కింద
యుద్ధాల త్రాచుపాములు
పొంచి ఉంటాయి !
సరిహద్దు గీతల్ని చెరిపి మళ్ళీ రాస్తాడు
మాటాడబోతే ముఖంమీద ఊస్తాడు !

## భస్మాసురుడి శ్మశానం

పెను సంపదలొక ప్రక్క
పేదరికం ఇంకో ప్రక్క ఉన్న
తన దేశంలో ఎత్తుపల్లాలు
చదునుచేసుకోడానికి ప్రయత్నించడుగాని
పరాయిదేశాలకు
సిఐడీలను పంపిస్తూ
కాలభైరవికి కొబ్బరికాయలు కొడతాడొకడు !

అసలు
మానవుడి మనుగడకే ముప్పుతెచ్చే
ప్రయత్నాలు చేస్తాడు
మరి
అవి ఫలిస్తే
తానూ అందులో చస్తాడు
భస్మాసురుడేం చేస్తాడు
తన శ్మశానం తనే తయారు చేసుకుంటాడు.

## నీతివాణిజ్యంలో దివాలా

ఈనాడు
మానవుడి నీతి ఖజానా నిండుకుంది
నీతి వాణిజ్యంలో దివాలా తీశాడు
భవిష్యన్మానవజాతిగురించి
విపంచి మీటడం మానేశాడు
అధికార మద్యం పుచ్చుకుని
విజ్ఞాన శాస్త్ర పాంచాలి బట్టలు ఒలిచేశాడు !

## సృష్టిమీద బాంబులు

యంత్రాలతో
జీవితాల్ని హంసతూలికా తల్పాలుగా మార్చి
నాగరకతకు నగిషీలుపెట్టి
ఆకాశం అంచులు చూసి
కాలానికి కళ్ళెంవేసి
దూరాన్ని ఫొటోలు తీసి
మనిషి మరో బ్రహ్మ అయిపోయాడు
మంచిగా బతుకుదామనుకుంటున్నాడు
కానీ
ఇంకో మనిషి
ఇంతకన్నా ముందుకు పోయి
A బాంబుల్నీ
N బాంబుల్నీ
H బాంబుల్నీ
AటుZ బాంబుల్నీ తయారుచేసి
ఆ బ్రహ్మ సృష్టిమీద పారేద్దామని
అసూయగా చూస్తున్నాడు !
ఈ యిద్దరూ మానవజాతి కళ్యాణానికి
అగ్రిమెంటు రానుకునేదెప్పుడు ?

## చంద్రనిప్పు

న్యూయార్కులో సూర్యుడూ
మాస్కోలో సూర్యుడూ ఒకడే !
నీగ్రోకి ఉంది ప్రేమరాగం

దొరికే ఉంది వెతుకుతోంటాడు
మనిషి
ఇండియాలో ఉన్నా
ఈజిప్టులో ఉన్నా
అవయవ నిర్మాణం
అనురాగ విరాగాలూ
శోక శ్లోకాలూ
అన్నీ ఒకలాంటివే!
తేడాలు రంగుల్లోనూ భంగుల్లోనూ
కానీ
స్పందనాలూ తిరుగుబాటులూ ఒకటే!
కానీ
విడనుకుంటాడు
"నేను గొప్ప వాడు చొప్పు" అని
అదే తప్పు
అదే ముప్పు
అక్కడే చంద్రుడికుప్పు!

## నదులన్నీ సముద్రంలో

ఇంకో రకం తేడా
అది ఇజాల తేడా
ఒకడిది మార్క్సిజం
ఒకడిది కేపిటలిజం
ఒకడిది గాంధీజం
ఒకడిది మావోయిజం
ముందో వెనకో సోషలిజం
చివరి పరిణామం కమ్యూనిజం
నదులన్నీ సముద్రంలో పడటం సహజం
ఇంతకూ ఏది నిజం
ఇదంతా జెండాల భేషజం
ఒకడిది తెల్లజెండా
ఒకడిది ఎర్రజెండా
ఒకడిది మువ్వన్నె జెండా

## కుక్క గొడుగులు

భిన్నత్వంలో ఏకత్వం ఉంటేనే
ప్రపంచం బతికి బట్టకడుతుంది!
శాంతికాంతతో కాపురం రక్తి కడుతుంది
గోరీ గజనీ హిట్లర్
ముసోలినీ ఆయూబ్ భుట్టో
లాంటి నరహంతకులు
కుక్క గొడుగుల్లా లేస్తే

యుద్ధాలు అనిరుద్ధాలు
ప్రళయాలు నిశ్చయాలు
కరువులు బరువులు
క్షీనాలు క్షామాలు!

## లైట్ హవుస్

విశ్వశాంతికోసం
విభిన్న దేశాల హృదయాలు కలవాలి
అణవ శక్తిని
మానవ రక్తికోసం మళ్లించాలి
విశ్వమానవుల కొరక
విధి అరుగుండాలి!
విశ్వశాంతి నౌకకు
లైటుహవుసవసరం!

## ప్రపంచదేహం

హింస నుంచి
ధ్వంసం నుంచి తప్పించి
శాంతినృత్యాన్ని
దేశదేశాల్లో ఒప్పించి
నరనారీ సహస్ర సహస్రాలకు
అజస్రం
ఆనందాంబరాలు కప్పించి
శాంతియుత సహజీవనంకోసం
దేశదేశాల ఆశయాలను మెప్పించి
మాసిపోయి, కంపుగొడుతున్న
నిరుద్యోగాన్ని రోగాన్ని
దీనత్వాన్ని అజ్ఞానాన్ని
ప్రపంచదేహంనుంచి విప్పించాలి!

## ఝంఝామారుతం ఆపు

మానవజాతి జిందాబాద్
సమరానికి స్వస్తి పల్కు
కలహాలను పట్టి చంపు
గతచరిత్ర మొక మూలుగు
భావిగాథ ఒక దేవుడు
హాలాహలం మ్రింగు
ఝంఝామారుతం ఆపు
"SAVE SUCCEEDING GENERATIONS
FROM THE SCOURGE OF WAR"
నిలయాగ్నిచ్చట్టులిందు త్రోయకుము పృథ్వీగోళ ఖండ కొప్పుడున్!

# గణపతి

శ్రీ ఐ. కార్తికేయశర్మ

శ్రీ గణనాయకుని పుట్టు పూర్వోత్తరాలు చాల వింతగా వున్నాయి. వేదకాలంలోకూడ వినాయకుని పూజలు చేసెడివారు. తైత్తిరీయ ఆరణ్యకమున దంతి భగవానునిపై నొక మంత్రమున్నది.

తత్పురుషాయ విద్మహేన వ్రకతుండాయధీమహీ
తన్నో దంతిః ప్రచోదయాత్॥

శయనాచార్యుడు ఈ దంతి వక్రతుండుడైన గణపతియేనని వివరించియున్నాడు. ఋగ్వేదమున బృహస్పతి పరశు లేక బంగారు గొడ్డలి, కుడిచేతిన కల్గియుండెను. బృహస్పతినే గణపతిగా పేర్కొనబడియున్నది. ఫాదర్ హీరాస్ పండితుడు గణేశుని గాథలనుగూర్చి పరిశోధించి, చక్కని గ్రంథాన్ని ప్రచురించియున్నారు.[1] ఇందున, లూరిస్తాను (యిది పశ్చిమ ఇరాన్ దేశమునగలదు), త్రవ్వకములలో లభ్యమైన నొక కాంస్య పళ్ళెరము (సగభాగము), చాల ముఖ్యమైన వస్తువుగా పేర్కొనబడినది. ఈ పళ్ళెరముపై హస్తిముఖముగల దేవతాస్వరూపము మరికొన్ని భగవత్ స్వరూప సంకేతముతోకూడ చూపబడెను. శాసనముకూడ కలదు. ఇది క్రీ. పూ. 1200–1000 కాలమునాటిది. దీనిపై చిత్రించబడిన గణనాథునిగూర్చి వివరింతును.

(చిత్రపటము—1)

ఏనుగు ముఖముగలిగి మానవ స్వరూపమున యోధునివలె వేష భూషణములతో, కుషాణ రాజుల ప్రతిమలను బోలిన పొడుగుపాటి ఇరుకు పంట్లాము, పెద్దకోటు, బూట్లు ధరించి యున్నాడు. యెడమ చేతిన పొడుగుపాటి కత్తి,కుడిచేతిన 'శేషనాగుని' తోక పట్టుకొనియున్నాడు. మధ్యగా గుండ్రని ముఖము సూర్యభగవానుని సూచించుచున్నది. సూర్యబింబముక్రిందభాగమున శ్రీవత్స, పద్మములున్నవి. సూర్యుని శిరముపై పద్మము, అరులకము మొదలగు శుభ సంకేతములు కలవు. పళ్ళెపు యెడమ అంచునమరొక కత్తి ఎవరో చేతితో పట్టుకొనివున్నట్లు చూపబడి యున్నది... కాని ఆ చిత్రము పూర్తిగాలేదు. గణేశుడు తంత్ర శాస్త్రమున పరశువును, సర్పమును గల్గియున్నట్లు పేర్కొనబడియుండుట గమనింపవలసి యున్నది.

పైని పేర్కొన్న ఇరాన్ గణపతి చిత్రమునుబట్టి ఆ భగవంతుని రూప మత్యంతప్రాచీనమైనదై పర్షియా, ఇరాన్ దేశముల పూజ్యతయుక్తంగా పూజలో నుండినట్లు విదిత మగుచున్నది.



1. గణపతి, పర్షియాదేశము : క్రీ·పూ. 1200–1000. B. C.

దేవార్యుల కాలవాలమైన ఇరాన్, పర్షియా, మధ్య ఆసియాలోని సప్తసింధున, వేదకాలమున పవిత్రమైన భూమిగా విలసిల్లి యుండెను.

గణపతిపూజ ఆఫ్ఘనిస్తాన్‌లో మిక్కిలి ప్రజాదరణ చెంది యుండెను. ముఖ్యంగా కుషాణ–గుప్త చక్రవర్తుల సమకాలీనమైన పెక్కు మూర్తులు లభించినవి.[2] ఇటీవల డా॥ నారాయణ్ పండితులు బ్రిటిష్ మ్యూజియములోని నాణెముల పరిశోధించి ఒక ఇండో గ్రీకు వెండినాణెముపై గణేశుని[3] ప్రతిమ యున్నట్లు తెలిపినారు. ఈ నాణెము హెర్మియస్ రాజొసగినది. క్రీ. పూ. 2వ శతాబ్దినాటిది. ఈ విధంగా గణనాథుడు చాల పూర్వకాలంలోనే భగవంతుడుగా మహా రాజులు పూజించుటయేగాక, తమ రాజాంకములలోనాణెములలో

గూడ యీ స్వరూపాన్ని ముద్రించుకొని వారి భక్తి ప్రపత్తులు విదితం చేసుకొన్నారు.

ఇక తూర్పుదేశములైన ఇండోనీషియా, కంబూజ బర్మా, చైనాలలో కూడా గణపతి ఆరాధన క్రీ. శ. 6–7వ శతాబ్దులలో నుండియే విరివిగా నుండినట్లు తెలియుచున్నది.

ఇక మన దేశమున, ముఖ్యంగా ఆంధ్రమున గణేశుని వునికిని గూర్చి వివరింతును. ఇటీవల నేను అమరావతి [4] పురావస్తుశాల లోని శిల్పముల పునఃపరిశీలించటము జరిగినది. ఇదివరలో లభ్యమైన కొన్ని ముఖ్యశిల్పముల భాగములను జోడించి పూర్ణత నిచ్చే ప్రయత్నాలు చేసితిమి. అట్టి కార్యక్రమములో శిల్పకారుడు శ్రీ పద్మనాభన్ మూడుముక్కలుగా దొరికిన ఒక మాలావాహకుల జూపు ఉష్ణీష ఫలకమును పూరించినాడు. ఈ ముక్కలిదివరలో చిన్న భాగములుగా వేరు వేరుగా ప్రచురితములైనవి. ఈ సమకూర్పుటవలన అవన్నియు కలసి చక్కని వుష్ణీఫలకమై దీనిపై చెక్కిన మూర్తుల గాథ జుగుప్సాకరమైనది.

పటము 2

ఈ ఫలకము 11′, 6″ పొడవు, 2′ 2″ ఎత్తు, 7⅛″ మందము కల్గియున్నది. దాచేపల్లి సున్నపురాయి, పైన గుండముగా చేయబడినది. క్రిందభాగమున, నిలువుస్తంభములపై బిగించుటకు వీలుగా గుంటలున్నవి. ఎడమ భాగము పై యంచున దానమొనర్చిన శాసనము కలదు. (…………హాతుకాయననతుకాయ ఉనిసదానం) ఈ ఉష్ణీష ఫలక దానము కొడుకులు, కూతుళ్ళు గావించినది. ముందున్న యక్షరములు శిథిలమగుటవలన దాన మొసగిన వానిపేరు తెలియుటలేదు. శాసన లిపి శైలినిబట్టి క్రీ. పూ. 2వ శతాబ్దినాటిదని తెలియుచున్నది. ఈ ఫలకముపై వరుసగా చెక్కిన మూర్తులు ప్రాచీన శిల్పచరిత్రలోనే యరుదుగా కానవచ్చుచున్నవి.

1. యేనుగు ముఖముతో—పొట్టి శరీరము, పెద్ద పుదరము, కుదించిన బాహువులు, చేటలవంటి చెవులు, కుడిప్రక్కగా ముకుళితమైన చిన్న తొండముతో మానవాకారముగనున్న ఈ మూర్తి గణాధిపతిగా తోచుచున్నది. ధోవతి మోకాళ్ళవరకే యున్నది. ఘటాకారము కల్గిన పెద్ద పూసగల మాల పుదరము పైవరకు నున్నది. బొడ్డు ఆకువలె నున్నది. పై భారమును మోయుచున్న కుడిచేయి మాలను యెత్తి పట్టుకొన్నట్లు, ఎడమచేయి నడుముపైని, వున్నవి. చేతులలో కంకణములు గలవు.

2. పై మూర్తిని బోలి మరగుజ్జువలె బొద్దుగా కుచములతోనున్న యీ స్త్రీమూర్తి పైని యున్న మాలయొక్క బరువుచే చతికిలబడి కూర్చొనియున్నది. మెడలోని కంఠహారము కుచద్వయముల మధ్యగా వ్రేలాడుచున్నది.

3. ఒక ప్రక్కగా నిలబడి మాలయొక్క భారమును చేతులతో నెత్తి మోయుచు నడుచుచున్న మరొక మరగుజ్జు, తలపై ధరించిన టోపీ, (రామకిరీటి) మీసములు, యెగగటి యున్న ధోవతి, చెవులలోనున్న నీలోత్పలములను బట్టి ఈతడు కుబేరుడనుటలో సందియములేదు.

4. చివర, మకరము నోటినుండి వెలికి వచ్చినట్లుగా తూర్పు ముఖంగా కమలముపై కూర్చున్నది మహాలక్ష్మి. ఆమె తల నీలాలు రెండు పాయలుగా ప్రక్కగా నమరియున్నవి. పాపట బొట్టు, చెవుల యాభరణములు, చేమంతిపువ్వును బోలిన నవరత్న ఖచితమైన కర్ణాభరణములతో నలంకరింపబడియుండుట విశేషము. మాల ఆమె తలపై మోయుచున్నటుల చూపబడియున్నను, శ్రీ లక్ష్మీదేవి ఎంతో ఠీవిగా యెడమకాలు ముడుచుకొని చేతులతో బంధించి, కమలాసనయై యున్నది. ఈ ఫలకము ప్రక్కభాగమున 'గుడ్లగూబ' కూడ చిత్రింపబడి యున్నది. ఇది లక్ష్మీదేవి వాహనముగదా!

డా॥ ఆనందకుమారస్వామిగారు యీ యేనుగు తలను యక్షునిగా గుర్తించి 'యక్షరాజ' లేక గుహ్య లేక గణముగా భావించిరి.



2. ఉష్ణీషఫలకము : అమరావతి క్రీ. పూ. 2వ శతాబ్ది.



3. గణములతోటి వినాయకుడు. సింహళము: క్రీ. శ. 2వ శతాబ్ది.

బహుశ గణాధిపతి స్వరూపమై యుండవచ్చునని చెప్పినారు. శ్రీ శివరామమూర్తి దీనిని క్రీ. శ. 2వ శతాబ్ది కృతమై యుండుననియు, యీ శిల్పము గణేశుని రూపమును బోలినదిగా కనపడుచున్నదని తెలిపిరి. వారిరువురికి గూడ పై అన్ని భాగముల నొకచోట చేర్చి విషయమును పరిశీలించు నవకాశము కలుగలేదు.

మొదటనున్న రూపము నిశ్శంసయముగా గణాధిపునిదే; మిగతా గణములకన్న మొట్టమొదటగా చూపబడినాడు. ఆ తరువాత స్త్రీమూర్తి నిశ్శంశయముగా "గణేశాణి" గణాధిపుని భార్య. దక్షిణదేశమున గణపతిని భార్యతోసహా పూజించుట లేక శిల్పమున చూపుట యెక్కడను కానరాదు కాని వుత్తర భారతమున ముఖ్యంగా భూమార, దేవగఢ్, బేరాఘాట్ (మధ్యప్రదేశ్) మున్నగుచోట్ల గుప్తరాజుల కాలంనాటి ప్రతిమలు గణేశుడు, శక్తితోకూడ మున్నట్టివి గలవు. మూడవ స్వరూపము కుబేరునిది. ఈతడు యక్షేంద్రుడు, ధనరుడు, లోకపాలకుడు. ఈతడు కూడ గుహ్యావతి. శ్రీ లక్ష్మికి చాల సన్నిహితుడు. అష్టనిధులతో లక్ష్మిప్రసన్నుడైన కుబేరుడు ఆమె ప్రియుడు కూడ. చాల విధాలుగా కుబేరుని, లక్ష్మితో కలశి చెక్కిన శిల్పములు కానవచ్చుచున్నవి. మహాలక్ష్మి అన్ని లాంఛనాలతో, లక్షణములతో చూపబడియున్నది.

బౌద్ధస్తూపమున హిందూదేవతల నిట్లు మాలావాహకులుగా మార్చి చూపుమన్న శిల్పము బహుశ యిది ఒక్కటి మాత్రమే కాబోలు? గణాధిపతి, ఆయన భార్య, కుబేరుడు, లక్ష్మిదేవి సహా బుద్ధునికి పెద్ద మాలను సమర్పించు కార్యక్రమములో నున్నారు. దీనిని బట్టి బౌద్ధ మెంతటి ప్రాభవముతో క్రీ. పూ. 2వ శతాబ్ది కాలమున ఆంధ్రమున వెలశెనో తెలియుచున్నది. ఇట్టి శిల్పములు మరెక్కడను కానరాలేదు. వెతకగా సింహళమున నొక బౌద్ధ చైత్యమున గణాధిపుని, గణములమధ్య చైత్యమును మోయుచున్నట్లు చూపబడియున్న శిల్పము తటస్థించినది.

పటము 3

ఈ శిల్పము క్రీ. శ. 2వ శతాబ్ది నాటిది. సింహళదేశమున

ప్రఖ్యాతిగాంచిన కంటక చేతింగ స్తూపమున లభ్యమయినది.

అశోక చక్రవర్తి కూతురు చారుమతి గణపతికై నేపాలున దేవాలయముకట్టినట్లున్ను, బుద్ధ భగవానుడు రాజగృహమున ఆనందునికి 'గణేశహృదయ' మను మంత్రమును బోధించెననియు గాథలు కలవు. నేపాలులో గణేశుని సిద్ధిదాతగా గ్రహించుటయేగాక సతీ సమేతునిగా సింహముపైని, కూర్చునియున్న హేరంబ గణపతి పూజ మక్కువతో చేయుచుండిరి. బౌద్ధ బిక్షువు లీ గణపతి హృదయ మంత్రమును క్రీ. శ. 7–8 శతాబ్దులలో చైనా, జపాను దేశములకుకూడ వ్యాప్తిచేసిరి.

హిందువులకీ గణనాథుడు మిక్కిలి ప్రీతిపాత్రుడు. మొట్ట మొదట పూజించబడు దైవము. మహాగణపతి ప్రతిమ దేవాలయమున పూజలో నున్నట్టిది మధురలో 20 అంగుళము యెత్తున్న గణేశ ప్రతిమ. ఈ మూర్తి క్రీ. శ. 4–5 శతాబ్దికి చెందినది.

ఆంధ్రమున నే నిటీవల చేజర్ల గ్రామమునగల కపోతేశ్వరాలయమున మరొక ప్రాచీనమైన గణేశమూర్తిని చూచితిని ఈ ప్రతిమ పై దేవాలయ మండప ముఖ్యద్వారమున కుడిప్రక్కగానున్న కోష్ఠములో నున్నది. విజయపురి ఇక్ష్వాకులనాటి క్రీ. శ. 3–4 శతాబ్ది కృతముగా తోచుచున్నది. అర్ధపర్యంకాసనము, రెండే చేతులు, కుడిచేతిని పాత్రయున్నది. తలపై శిరాస్త్రకమున్నది. కిరీటములేదు. చాటవలెనున్న చెవులు, యజ్ఞోపవీతము లేకుండుట పైనపేర్కొన్న అమరావతి వినాయకుని బోలియున్నాడు.

(పటము–4)

పైన వివరించిన వానిని పరిశీలించినచో గణపతి దేవతగా మొట్టమొదట పర్షియా, ఇరాన్ దేశములలో వేదకాలమునుండియే ఆరాధ్య దైవముగా పరిగణింపబడెను. ఉత్తర హిందూస్థానమును, సప్తసింధుప్రాంతమును పరిపాలించిన గ్రీకురాజులుకూడ హిందూ మతావేశులై శివపార్వతులను, స్కంద, గణపతి మొదలగు దేవతా స్వరూపాలను వారి నాణెములపైగూడ ముద్రించిరి. ఆంధ్రమున, మిగత దక్షిణదేశమునందుకూడ, గణపతికి ప్రత్యేకముగా దేవాలయములు తొలుతలేవు. బౌద్ధసంస్కృతిలో ఈ గణాధిపుడు మాలా వాహకుడుగా లేక చైత్యమును మోయునట్టి దిగ్గజముగా, చూపబడియున్నాడు.



4. వినాయకుడు: చేజర్ల. క్రీ. శ. 3–4 వ శతాబ్ది.

వేదకాలపు దైవమైన దంతి యీవిధంగా గణపతిగా చాల కాలముండినను, క్రీ. శ. 3–4 శతాబ్దిలలో మరల హిందూమతము వృద్ధిలోనికివచ్చి వ్యాప్తిచెందుటవలన కాబోలు గణపతి దేవుడుగా, ప్రత్యేక కోష్ఠములలో పూజించుట యాచారమైనది. వేరుగా 'మూర్తి' లక్షణములు కల్గి ప్రాచీన దేవాలయమైన చేజర్లలోనున్న వినాయకుడు మనకు లభ్యమైన ఈదేవుని విగ్రహములలోకల్ల గొప్పదిగా పేర్కొనవలసియున్నది. ఆతరువాత తూర్పు, బాదామి చాళుక్యుల కాలంనుంచి వినాయకుడికి మహత్తర ప్రచారము పూజార్చనలు మెండైనవి.

కాని పెక్కు దేవాలయముల లోనూ చక్కని స్వామి శిల్పములు చూచినచో బొజ్జగణపయ్య తన భగవత్ స్వరూపాన్ని వదలి ప్రజల



5. పానుగల్లు : నృత్యగణపతి. క్రీ. శ. 12–13 వ శతాబ్ది.

లోనికివచ్చి ఆడుతూ, పాడుతూ వుండేవాడు. ఖజురాహో దేవాలయము

(పటము–5)

లోను, పానుగల్లు దేవాలయ ద్వారశాఖలపైని మెలిమురిపి నృత్యం చేస్తున్న గణపతిదేవుని విభిన్న భంగిమలు చూచి తీరవలసిందే.

ఓం శ్రీ గణాధిపతయే నమః.

# అ ధో జ్ఞా పి క లు


1. Father Heras, The problem of Ganapathy ? (varanasi, 1972).

2. M. K. Dhawalikar, in East and West, 21 nos. 3-4. PP. 331.336 and in India's contri bution toworld Thought and culture. (1970) PP. 1.16

3. Journal of the Numismatic Society of India XXXVI (Varanasi, 1974). P. 190

4. I. Karthikeya Sarma, "A Unique Ushnisha, (coping stone), from Amaravati", Journal of the Andhra Historical Research Society, XXXV, (Hyderabad 1975 - 76)

# ఆత్మవేదన

శ్రీమతి శ్రీనివాసపురము యస్. రమాదేవి

ఇదియొక విషాద జీవిత మీ విధమ్ము
మదిని బాధించునై స్పృహ్యమనవరతము
జగతి వినబోదు నారొదవెగటు దోప
వినుమఖిల నిరస్తము నాదు వేదనమ్ము.

ఏపుడు నయనోష్ణజలములో నిచ్చదడిసి
నా కలముచిందునో వేదనమ్మ నపుడ
జగతి పఠియించు నా రొద సంబరమున
పొగడు వేనోళ్ళ నిరతంబు పొంకముగను.

బ్రదుకు బరువను రంగుతో భారముగను
నాదు కుంచియ కదలుచు నాట్యమాడు
నెప్పుడు—అప్పుడ జగతి నన్నెఱిగి మిగుల
ప్రీతి జూపును నాదెస ప్రేమమీఱ.

అలమటించెడి జనముల ఆర్తనాద
మేళనమ్మయి నా గొంతుమృదుల ఫణితి
పాడినప్పుడ విను నీ ప్రపంచకమ్ము
వేయు కరతాళముల ధ్వని చేష్టలుడిగి.

నిశ్వసనమందునూగుచు నిండినట్టి
అంగభంగిమ మాఱి పోవంగ నెంతు
తపనతో నృత్యములుసేయు తఱిని పొగడ
భూమి తన భాష నెఱుగదంద పోలదనును.

నిస్పృహా విరహా నిర్వేద నీరవమగు
కఠిన పాషాణముల నిలకడగ పోరి
మలచి నిలిచిన యులికి పూజలను సలిపి
జీవ నిర్జీవ ప్రతిమ గాంచెడిని జగతి.

భావముల బరువున గుండె పగులువాఱి
పలుకురూపంబు నెప్పుడే మలచికొనియు—
విలువ నార్జించునప్పుడే చెలిమిజేసి
ఈ ప్రపంచంబు—నన్ను గుర్తెఱిగి కొనును.

కాల సంద్రంబులో ననుభవాల ఓడ
లనతుఘానుమన్నింపదనియు దెలియు—
ఎప్పుడును నిందసేయ—భాషింతుగాని;
లోకమున కెందుకో నేనులోకువగుట ?

విత్తగలేని జ్ఞాపకపు
బెత్తుల యొత్తిడి నంతులేని వు
న్మత్త విషాద వీచికల
బ్రమగ్గెడి తీక్ష్ణతలో తపన్ను నా
యత్త మొనర్చి కర్మ నియ
తంబగు జీవన యాత్రసేయగా
నత్తఱి నన్ను గుర్తెఱిగి
హర్షము బొందును లోకమంతయున్.

నిందసేయు నన్ను-నేడు యీ లోకంబు
రేపునా-కదృష్టరేక జూపి
మించినపుడు వేగ—హించి పూజలు సేయు
అఱుతమాలవేసి అర్ఘ్యమిచ్చి.
ఉపమానంబులు చెప్పరానివగు కీ
ర్త్యుల్ జ్యోత్స్నలందుద్దిగా
న్మప్రతిష్ఠింపగ జాలు నాడరయగా
నుత్కంఠతో గొంతుకల్
'కృప-దాసోఽహ' మటన్న శబ్దములు ది
క్కుల్ పిక్కటిల్లింగ న
న్ను పవిష్టంబొనరించుగా కనుచు మే
రు శృంగ పీఠంబు నన్

# పంచపాత్ర

## శ్రీ కె. ఎస్. వి. నరసింహం

(గత సంచిక తరువాయి)

## 2

అవును, కళాకీ, నాకూమధ్య పేచీ ఎందుకొచ్చిందో ఎలావచ్చిందో కళాకీ తెలీదు, నాకూ తెలీదు. వాడు పట్టుదలమనిషి, నేనూ పట్టుదల మనిషిని. కారణాలంటే—ఇవే కారణాలు కావొచ్చు—తలుచుకున్న పని చేసి తీరతాడు వాడు. నేనొద్దన్నపని ఎవరు చేసినా సహించలేను నేను. పెద్ద పేచీ ఇది. ముదిరేదాకా ఇది పెద్దపేచీ అని మా ఇద్దరికీ తెలీదు.

ఆగర్భ శత్రువుల్లాగా నేనూ, అఖిలా మెలగడం కళా సహించలేక పోయేవాడు. తను ప్రేమించే ఇద్దరూ పరస్పరం ద్వేషించుకోవడంలోగల విధివైచిత్రి ఎంత ప్రయత్నించినా వాడికి అర్థంకాలేదు. ఇంట్లో మా ఇద్దరిమధ్యా వాడు స్వేచ్ఛగా తిరగలేక పోయేవాడనేది మాత్రం నిజం. అది నేనిప్పుడే తెలుసుకున్న నిజం. అప్పుడు తెలీదు నాకు.

అందుచేత, సాధ్యమైనంత సమయం ఇల్లొదిలి బైట తిరుగుతూనే గడిపేవాడు కళా. స్నేహితులున్నారు. వాళ్ళతో పరిచయం మరీ ఎక్కువైంది. వాళ్ళతోటిదే లోకమైపోయింది.

కళా అలా ప్రవర్తించడం నాకిష్టం లేకపోయింది, కాని ఆ సంగతి వాడి ముఖాన్నే చెప్పలేకపోయేను. కళా ప్రవర్తనకి కారణం నాకు తెలుసు, కారణం—నేనే! నేనూ—అఖిలా మాత్రమే కారణం! కాని, ఆ చేదు నిజాన్ని వొప్పుకునే ఆత్మస్థైర్యం నా కెక్కడిది? కారణం నేనేననీ వొప్పుకోలేను. కళా—అయినవాళ్ళతో, కానివాళ్ళతో కూడా కలిసి మెలిసి అదే జీవితంగా వాళ్ళతోటే కాలం గడుపుతూండడం కూడా సహించలేను!

ఏం చెయ్యను ?

ఏమీ చెయ్యలేను!

కళాకోసం వాడి స్నేహితులు అప్పుడప్పుడూ బంగళాకి వస్తూండేవాళ్ళు. వాళ్ళని చూస్తే నాకు తగని వొళ్ళుమంటగా వుండేది. వొక్కొక్కళ్ళ్నీ జుట్టుపట్టిలాగి హింసించి చంపాలనిపించేది. పూఁ హుఁ—వీలుపడదు. అందుచేత—ఏం చేసేవాణ్ని? కళా ఇంట్లో వుండగానే—ఇంట్లో లేడని వాళ్ళని పమ్మించేసేవాణ్ని. సోఫాల్లో వాళ్ళు కూచునివుంటే చిరాగ్గా చూసేవాణ్ని. కళాకిష్టన్ లెండ్ లెటర్సుగానివొస్తే—చించకుండానే—మడతసందులోంచి చదవగలిగేంతా చదివేవాణ్ని. ఇదంతా నేనెందుకు చేసేవాణ్నో నాకే పూర్తిగా అయేదికాదు. కాని, ఇలా ప్రవర్తించకూడదని ఎంతగా ప్రయత్నించినా సాధ్యం కాలేదు. నా ప్రతి చేష్ట కళా గమనిస్తూంటాడని తెలిసి కూడా నేనతని స్నేహితుల్ని ఏదోరకంగా అవమానిస్తూండేవాణ్ని. వొకసారి వొకతమాషా జరిగింది. అప్పుడది తమాషాయేగాని, తలుచుకుంటే ఇప్పుడు నాకు లజ్జ అనిపిస్తుంది.

కళాకి బైట వూళ్ళలో కూడా స్నేహితులున్నారు. ఉత్తరాల స్నేహితులు. హైదరాబాదునుంచి కాబోలు ఐదుమం దొచ్చేరొకసారి కళాకోసం. ఐదుమందీ బంగళాలోనే దిగేరు. అది నా కిష్టంలేదు. ఆ సంగతి కళాకి తెలుసు. నేను చెప్పలేను. గ్రహించినప్పటికీ కళా మాత్రం ఏం చెయ్యగలడు? అంత పెద్ద ఫ్యాక్టరీ యజమాని కొడుకు, రాకరాక వొచ్చిన స్నేహితుల్ని ఏ లాడ్జిలోనో ఎలా దింపుతాడు? అదీ, అంత విశాలమైన బంగళా వుండగా!?

సరే, ఆ అయిదుమందీ బంగళాలో మూడు రోజులున్నారు. ముఖాముఖీగా వాళ్ళనెప్పుడూ కలుసుకోలేదు నేను. టీనేజర్సు అంటే నాకు సానుభూతి లేదు. కళాకి అంతమంది స్నేహితులుండడం, వాళ్ళొచ్చి నా ఇంట్లో బసచెయ్యడం—ఏమాత్రమూ నచ్చలేదు నాకు. చెప్పలేదూ—కారణాలు తెలియని అనేక విషయాల్లో ఇదీ వొకటి!

మూడు రోజులు ఆ అయిదుమందీ బంగళాలోవున్నా, వాళ్ళెప్పుడూ నా కంటబడలేదు. వాళ్ళని నాకు పరిచయం చెయ్యలేదు కళా; పరిచయం చెయ్యలేదు! ఎందుకంటే—అది వాడు గిట్టదు!

మూడోరోజు రాత్రి నాకెందుకో అనీజీగా వుంది. కళాకోసం అయిదుగురు స్నేహితులొచ్చి నా ఇంట్లో వుంటూండగా—నేను వాళ్ళలో ఏ వొక్కళ్ళ్నీ ఏ వొక్కసారీ కూడా—అవమానం చెయ్యలేదే!!

అదేం బుద్ధో నాకు తెలీదు.

నా ఆలోచనకి నాకిప్పుడు చెప్పలేనంత అసహ్యం వేస్తుంటుంది.

ఆ రాత్రి పదకొండు తర్వాత ఇంకా కళా గదిలో లైటు వెలుగుతోంది. అయిదుమంది స్నేహితులతో నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నాడు కళా. ఆ నవ్వులు నాగదికి వినిపిస్తున్నాయి.

అయిదుగురూ మరుసటిదినం హైదరాబాదు వెళ్ళిపోతారని నాకు నౌకర్లవల్ల తెలిసింది.

అందుకే — అంత సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

నాకు నిద్రపట్ట లేదు.

వెళ్ళేలోపలే వాళ్ళందర్నీ వొక్కసారైనా అవమానించాలి.

ఏలా ? ఎలా ?

నీకు తెలీదు, అదేం కాంప్లెక్సంటారో — ఏవరైనా సైకాలజిస్ట్ని అడిగి తెలుసుకోవాలి.

అసహ్యమైనా సరే-అందులో ఏదో వొక ఆనందం వుండే వుంటుంది.

గదిలోంచి వెలుపలి కొచ్చేను. కళాగదిలో లైటు వెలుగుతోంది. ఫ్యాన్ గిర్రున తిరుగుతోంది. కిటికీ అద్దంమీద నీడ కదులుతోంది. గదిలో స్నేహితుల్తో కళా నవ్వుకుంటున్నాడు. ఏం చెయ్యాలి ? ఏమీ తోచలేదు. మెల్లిగా మేడ దిగొచ్చేను. వరండాలో పచార్లు చేసేను. పైనుంచి నవ్వులు వినిపిస్తున్నాయి. ఏంచెయ్యాలి ? చీడీల ప్రక్కగావున్న మెయిన్‌స్విచ్ కనిపించింది!!... ఆ ఆలోచన అప్పుడెలా వొచ్చిందో తెలీదు — చప్పున వెళ్ళి మెయిన్ స్విచ్ ఆఫ్ చేసేసేను. మరునటి క్షణంలో పై నుంచి కేకలు వినిపించేయి—

"గోవిందా—లైట్ ఆరిపోయింది !"

"కరెంటు పోయింది—"

"అయ్యో ! లైటుంటే బాగుణ్ణే !..."

నాకే తెలీని విజయగర్వంతో వూగిపోయేన్నేను.

ప్రపంచాన్నంతటినీ జయించినా కలగని ఆనందం కలిగింది.

"ఏవరది ?—" అన్నాడు నైట్‌వాచ్‌మన్. మెయిన్ స్విచ్ ఆఫ్ చేసేనుకదూ ? మామూలుగా వరండాలో రాత్రిళ్ళు లైటు వెలిగేది. అదీ ఆరిపోయింది.

"నేనేలేరా !..." అన్నాను.

గమ్మున నాగది కొచ్చేసేను.

నేను మెయిన్‌స్విచ్ దగ్గర తారట్లాడడం వాచ్‌మన్ చూసేడా ? నేనే ఆఫ్ చేసేనని పసిగట్టేడా ?

ఏమో ! కాని—

మరుసటిదినం స్నేహితులందర్నీ పమ్పించేసి ఇంటికొచ్చిన కళా—హాల్లోవున్న నాకేసిచూసిన చూపులో ఎంతో జుగుప్స కనిపించింది.

తెలిసిపోయింది !

క్రితంరాత్రి నేనుచేసిన లజ్జామాలినపని కళాకి తెలిసిపోయింది!

ఆసంగతినాకు ఖచ్చితంగా తెలిసిపోయింది.

ఎంత సిగ్గుచేటు !

కోటి రూపాయల ఆస్తి అయినా వుండొచ్చునాకు. కాని, నేను చేసిందెంత హేయమైనపని ! ఎవరూ నమ్మరు, నమ్మలేరు. నేను—ఆపని చేసేనంటే! ఎందుకు చేసేను? తెలీదు. ఎవరికీ తెలీదు.

అసలు నాకే తెలీదు.

చెప్పేనుగా — పెద్దమనిషిలో చిన్నబుద్ధి !

కళా స్నేహితులమీద నాలో అజ్ఞాతంగావున్న కసి !

ఏ సైకాలజిస్ట్నో అడగాలి ... ...

"సారీరా, బాబూ !" అని కళాతో చెబుదామనిపించింది చెప్పలేదు. అభిమానం అడ్డొచ్చింది.

"ఎందుకు చేసేవు డేడీ అలాగ ?—" అని కళా అడగరాదూ? వూహుఁ — అడగలేదు, అడగడు. వాడు కళా ! నాకొడుకు, నా అభిమానం వాది, వందమంది ధనపతుల అభిమానం వాడిది.

లోకంలో ఇలాంటి వాళ్ళుంటారా ?

ఇంత సంతాలకి పోతే చివరి కేమౌతుంది ?

ఏమౌతుంది, చెప్పూ — నువ్వు రచయితవి ... ...

"ఇంతకూ ఏమైంది ? మీరు చెప్పండి !..." అన్నాను.

"ఏమయ్యింటుందో నువ్వూహించలేవూ ?" — అన్నాడు ధనపతి — ఇహ చెప్పాల్సింది ఆట్టే లేదన్నట్టుగా.

"గలను—కాని—ఊహకన్నా వాస్తవం వినడమే బాగుంటుంది నాకు —"

"ఊహ రసవంతం. వాస్తవం నీరసవంతం. ఆ సంగతి మొదటే చెప్పేన్నీకు. బోరు కొడుతోంది కదూ ? ..."

"బోరు నాకు కొత్తకాదు. అదీ వొక విద్యే. అందరూ అందంగా బోరుకొట్టించలేరు —"

''హాహా—ఇలాగైతే నువ్వు పైకిరాలేవు—'' అని చప్పరించేడు ధనపతి.

''ముందు మీ కథ బైటికి రానివ్వండి—'' అన్నాను. అందుమీదట ధనపతి ఇలా కొనసాగించేడు—

...అంతే. ఆదినం నుంచి కళా మారిపోయేడు. కొత్తకొత్త అలవాట్లు నేర్చుకున్నాడు.

''సినబాబుగారేటండీ — సిగిరెట్లట్గా వూది పారేస్తారు—'' అన్నాడొకరోజు — నా ఆంతరంగిక నౌకరు, నమ్మకస్థుడు.

నివ్వెర పోయేను.

సిగిరెట్లెందుకు తాగడం మొదలెట్టేడు కళా ?

నివ్వెరపోవాల్సినవి ఇంకా చాలా జరిగేయి.

కళా తాగుడు మొదలెట్టేడు.

జూదం నేర్చుకున్నాడు.

వీటిలో ఏవీ కళాకి మొదట ఇష్టంలేదు. ఆ సంగతి నాకు తెలుసు, బాగా తెలుసు. నేర్చుకున్నాడు కళా, కావాలనే నేర్చుకున్నాడు.

మందలించాలి. ఎలా మందలించను? ముఖం చెల్లలేదు.

అఖిలతో ఈ విషయాలన్నీ చెప్పాలనుకున్నాను.

చెప్పలేదు.

ఏమని చెప్పను? ఎలా చెప్పను?

కళా కొత్త అలవాట్లు ఆమెకీ తెలిసేయి. ఆమె జోక్యం కలిగించుకోలేదు. కలిగించుకోదని తెలుసు.

ప్రేమగా మారలేని ద్వేషం ద్వేషంగానే మిగిలింది.

కళా పాడైపోతున్నాడు. ఆ సంగతి నన్ను బాధిస్తోంది.

ఎవరో కొందరు స్త్రీల పేర్లతో కళాపేరు కలిసి నాకు వినిపించడం ప్రారంభమయేసరికి నాకు పూర్తిగా మతిపోయినంత పనయింది.

సాధ్యమైనంత తొందరలో కళాకి పెళ్ళి చేసెయ్యాలని ఆ ప్రయత్నాలు మొదలెట్టేను. మా బంధువర్గంలోంచి సమ్మంధాలు కూడా విరివిగా రాసాగినై. అంతలో—

యుద్ధం డిక్లేర్ చేసేడు కళా నామీద. పరోక్షయుద్ధం కాదు. ప్రత్యక్ష యుద్ధమే!

ఫ్యాక్టరీ కార్మికులు సమ్మె చేసేరు.

జీతాలు చాలవు. పెంచాలి. యూనిఫామ్స్ మంచివి సప్లయి చెయ్యాలి. షిఫ్ట్ సిస్టమ్‌లో సంస్కరణలు కావాలి బోనస్‌లు పెంచాలి. హాస్పిటల్ సౌకర్యాల్లేవు. సౌకర్యాలన్నీ కలిగించేంతవరకూ పనిలోకి రాం. వేరే కార్మికు లెవ్వర్నీ రానివ్వం.

''ధనపతి—డౌన్ డౌన్—''

''కాపిటలిజం—నశించాలి!—''

నినాదాలు, ఊరేగింపులు, సభలు,

తల తిరిగిపోయింది నాకు.

వొక్కసారిగా ఈ గొర్రెమంద కార్మికులకి ఇంత చైతన్యం ఎలా వొచ్చింది?

తెలిసిపోయింది.

కళా చేసేడు! అంతా కళా చేసేడు!! తండ్రిమీద కత్తి గట్టేడు కళా!

జిల్లా కలెక్టర్ తణిఖీ, లేబర్ మినిస్ట్రీనుంచి వొత్తిడి.

ఏం చెయ్యాలి ?

దిక్కు తోచలేదు.

కార్మికులందరికీ వొక నాయకుడున్నాడు. కళా మాటలతో పొంగి ఆవేశం తెచ్చుకున్నది వాడే! సమ్మె జరిపిస్తున్నదీ వాడే!

కళా నా మీద కత్తిగట్టేడన్నాను కదూ?

ఆ కత్తి—ఆనాయకుడే!

నాకూ సలహాదారులున్నారు, మందీ మార్బలంవుంది. నేనూరుకున్నా నా సిబ్బంది వూరుకోదు.

సమ్మె ఉధృతంగా జరుగుతూన్న పక్షం దినాల్లో వొక మధ్యాహ్నం—ఫ్యాక్టరీకీ, వర్కర్స్ కాలనీకి మధ్య వొకఘోరమైన లారీ ఆక్సిడెంట్ జరిగింది.

సమ్మె జరిపిస్తూన్నకార్మికనాయకుడు ఆ ఆక్సిడెంట్‌లోమరణించేడు!

జనం దాని గురించిన నిజాలూ, అబద్ధాలూ కథలు కథలుగా చెప్పుకున్నారు. సరే—పోలీసులొచ్చేరు. ఎంక్వయిరీలు జరిపేరు. సాక్ష్యాలుకూడా సేకరించేరు—పోస్ట్ మార్టం రిపోర్ట్ కూడా వచ్చింది.

పూటుగా తాగేసి నట్టనడిరోడ్డుమీద నడుస్తూ వొచ్చిన కార్మిక నాయకుడు—తూలి లారీకిందపడి చనిపోయేడు !

దుర్మరణం పాలైన కార్మిక నాయకుడి కుటుంబానికి నేను వొక సహాయ నిధిని ప్రారంభిస్తూ నా చందాగా పదివేల రూపాయల చెక్కు దఖలు పరిచేను.

ఆ విషయం గురించి నన్ను పొగుడుతూ పేపర్లన్నీ రెండేసి నిలువు కాలమ్స్ ఖర్చు పెట్టేయి!

ఆ తరువాత!

ఆ తరువాత ఏం జరిగిందనుకున్నావు?—

కళా కొన్ని దినాలపాటు మౌనంగా వుండిపోయేడు. రాత్రయితే దిలో లైటయినా వేసుకోకుండా ఆలోచనల్లోనే గడిపేవాడు నిద్రాహారాలు మానేశాడు. వొకరోజు రాత్రి కళా బంగళానుంచి మాయమైపోయేడు.

నౌకరొచ్చి చినబాబు కనిపించడం లేదని చెప్తే కళా గదికి వెళ్ళేను. సిగరెట్టు పీకలు! బ్రాందీసీసాలు! — అతి జుగుప్సాకరంగా వుంది గది!

టేబిల్ మీద వొక కవరుంది.

కవర్లో చిన్న కాగితం—

"డేడీ!—

నిన్ను నేను ప్రేమించేను. నా స్నేహితుల్ని నువ్వు టీజ్ చెయ్యడం చూసి నువ్వొట్టి అల్పబుద్ధి వనుకున్నాను నీలో నీచత్వం వుందని నాకిప్పుడు తెలిసింది. ఇక భరించలేను. నాకోసం వెదక్కండి. వెదికేరా? దొరికేది నా మృతకళేబరమే!

—కళా"

అని అందులో రాసుంది

అంతే!

అంతే...నా కళాని నేను మళ్ళీ ఎప్పుడూ చూడలేదు, ఇహ చూడలేను. వాడిహ ఇంటికి రాడు. నాకు తెలుసు. వాడురాడు. అంతే ... ...

— కథ చెబుతూ చెబుతూ రుద్ధకంఠంతో ఆగిపోయేడు ధనపతి.

"అయితే ఇప్పుడు కళా ఎక్కడువున్నట్టు ?—"

"తెలియదు"—

"తెలుసుకునేందుకూ మీరు ప్రయత్నంకూడా—"

"చెయ్యలేదు, చెయ్యలేను. ఎలా ప్రయత్నించను ? కళా తత్వం నాకు బాగా తెలుసు. తెలిసీ నేను వాణ్ణి వుసిగొల్పేను. వెదకొద్దన్నాడు. ఇక వెదక్కూడదు. అంతే!... కాని, వొక్కనంగతి చెప్పు ఆనందరావ్!... తప్పెవరిది ? కళాదా ? నాదా ? — లేక అంతా విధికృతం అనుకోవాలా ? వంశ పారంపర్య లక్షణాలని సమర్ధించుకోవాలా ? నాలోవున్న మొండితనమే కళాలోకూడా వుండి ఈ విపరీత పరిణామానికి దారితీసిందా ?—చెప్పు — నీకేది సబబనిపించినా చెప్పు — నేనేమీ అనుకోను—" అన్నాడు ధనపతి.

—పై ప్రశ్నలకి సమాధానాలు తెలిసికూడా చెప్పకపోయేవో... నీతల వేయి ముక్కలై పోతుంది—అని ధనపతి అనలేదు.

భేతాళుడి ప్రశ్నలకి పాపం విక్రమార్కుడు కాబట్టి సమాధానాలు చెప్పేడు. నిజానికి సమాధానాలేమిటో భేతాళుడికే తెలియవేమో!

నా భేతాళుడు ధనపతి.

"చెప్పు—నేనేం అనుకోను—" అంటున్నాడు.

శవంతో సహా చెబెక్కడు. ఏమీ అనుకోకుండా వుంటాడంతే! కాని నాకు మౌనభంగం కావడంలేదే!

"సబబు కేముందిలెండి—" అన్నాను చివరికి. అని, నవ్వేను— "ఏది ఏమైనా ప్రస్తుతానికి మీకథ రాయలేనేమో! అసలు - మొదట మీరు కథేమీ చెప్పనన్నారు. తరువాత మీగురించి మాత్రం చెప్తానన్నారు. తీరాచేసి మీరు చెప్పింది — మీ కొడుకు గురించి—"

"మర్చిపో—మర్చిపో—" అన్నాడు ధనపతి.

ఏమిటి మర్చిపోవడ మన్నాను.

"కళాగురించి నేను చెప్పిందంతా మర్చిపో—" అన్నాడు ధనపతి. క్షణంసేపు ఏదో ఆలోచించేడు — "సరే — వొకపని చేస్తావా ?—"

ఏమిటన్నాను.

"కళాగురించి నేను చెప్పిందంతా మర్చిపో!—మరేం ప్రమాదం లేదు. కాని నాగురించి వొక నవలరాయి. ఫరవాలేదు రాసిపారెయ్యి. అంతా ఫస్ట్ పర్సన్ సింగ్యులర్‌లోరాయి. చివర — కొడుకు ఇల్లు వదిలిపోయేసరికి తండ్రి ఆత్మహత్య చేసుకునేందుకు సిద్ధపడతాడు. ఆ తండ్రి సరిగ్గా నాలాంటి తండ్రే! ఆ—అన్నట్టు—నవలపేరు— "నాలాంటి తండ్రి—" అని పెట్టు—ఏం ? బాగుంటుదా ?— సరే— మార్చెయ్యి. వేరే ఏదైనాపెట్టు. ఏం ? కళాకు సంబంధించిన నా ప్రవర్తన వివరాలన్నీ గుర్తున్నాయికదూ ? ఆ వివరాలకు ఇంకొంచెం కలరింగ్ ఇవ్వు - ఫరవాలేదు. కాని, వొరిజినల్ థీమ్ మాత్రం మారిపోకూడదు. రచనమాత్రం అంతా పకడ్బందీగా వుండాలి!...'

ఆయన చెప్పేది నాకాట్టే రుచించలేదు. మాటవరసకి–మీరు చెప్పినట్లు, నవల రాస్తానే అనుకోండి–రాస్తే–ఏవౌతుంది?–"

"రాసి–పబ్లిష్ చేయించు–ఏదైనా పత్రికలో సీరియల్‌గా–"

నవ్వాగలేదునాకు. "సరే–పత్రికలవాళ్ళు వేసుకోకపోతే ?"

"ఎందుకు వేసుకోరు ? – ఏం ? – నాకథ అంత చచ్చుగా వుందా ? నువ్వు కొంచెం బాగానే రాస్తావని అంటారే!..."

"మీ కథ బాగుండడమూకాదు, దాన్ని నేను బాగా రాయడమూ కాదు. అది పత్రికలవాళ్ళకి నచ్చడమంట్లూ వొకటుందిగా! –"

క్షణం ఆలోచించేడు ధనపతి. "సరే – ఆ సంగతి నాకొదిలి పెట్టు – నవలరాయి నువ్వు – దాన్ని పబ్లిష్ చేయించే పూచీ నాది ..."

ఆయన మనసులో ఏముందో తెలీదు.

ఆయన చెప్పడు నేనడగను.

గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. (నాగదిలో గడియారంవుంది.)

ధనపతి వాచీ చూసుకున్నాడు.

"మరి నే వెళ్తాను–" అన్నాడు,

ఎక్కడికని నేను అడగలేదు.

ఎక్కణ్ణుంచి వచ్చాడో మాత్రం నాకు తెలుసుగనకనా?

"ఎప్పుడు పూర్తిచేస్తావు నవల ?–" అన్నాడు ధనపతి.

"ఆలోచిస్తాను–"

"ఈ వృద్ధుడి ప్రాణాలతో ఆడుకోకు –" అన్నాడు సీరియస్‌గాను.

"అదేమిటి?–" అన్నాను నివ్వెరపోతూ. "నిజం చెప్పండి–మీమీద నవల పబ్లిష్ అయినా–మీకేం లాభం?–"

"లాభనష్టాలు బేరీజు వెయ్యడానికి జీవితం వ్యాపారంకాదు–అయినా–ఏమో–నవల్ని కళా చదివితే–నేనే అది రాయించేనని గ్రహించి–మనసు మార్చుకుని నాకోసం మళ్ళీ వొస్తాడేమో!... ఏమో !...వస్తాడేమోనని..."

వొణికే గొంతులో ఆశ......

"ప్రయత్నించు–ఆనందరావ్! ఇంతకన్నా నీకు నేనేమీ చెప్పలేను నవల రాయి–కళాకోసం నేను వెదకలేను, వెదక్కూడదు వెదికితే వాడు నాకు దక్కడు ఇహ మిగిలింది దొక్కలేను –నవలరాయి–చాలు–ఏమో నా కళా మళ్ళీ వొస్తే–' కళ్ళు తిరిగి నట్టయి ధనపతి కొంచెం తూలేడు.

పట్టుకోబోయేను.

వారించేడు.

"ఫరవాలేదు. నేనిప్పుడే రాలిపోను–నా కళా రావాలి నా కళాని చూడాలి.. మళ్ళీ వస్తాన్లే ఆనందరావ్.." మతి భ్రమించిన వాడిలాగా శూన్యమైన కళ్ళతో చూసేడు. "మళ్ళీ వస్తాన టావా?–ఏమో! ఇహ నేనాట్టే దినాలు బ్రతకనేమో! నా కళారానేరాడేమో! కళాని చూడకుండానే......" వెర్రిగా నవ్వేడు..."అంతలే... అంతేలే...ఎవరికెంత ప్రాప్తమో అంతే......"

"మీరు వొర్రీ కాకూడదు–" అన్నాను, ఏదోవొకటనాలని–

నిశ్చలంగా చూసేడు ధనపతి. ఏదో చెప బోయేడు, చెప్పబోయింది చెప్పడం మానుకున్నాడు. నిట్టూర్చేడు.

"సరే నే వెళ్తాను. నవల రాయవూ?–"

అంతే! వెళ్ళిపోయేడు ధనపతి.

మెట్లు దిగుతున్న చప్పుడు, కారొకటి స్టార్టయి వెళ్ళిపోయిన చప్పుడు.

"సరే–నే వెళ్తాను. నవల రాయవూ?"

ధనపతి గొంతు గదిలో మంద్రస్థాయిలో ప్రతిధ్వనిస్తోంది! చీకటి గుహలోంచి విషాద మృదంగాలు మ్రోగినట్టుగా నం!!

యాంత్రికంగా సిగిరెట్టు అందుకుని వెలిగించేను......

ధనపతి గురించే ఆలోచిస్తూ వున్నాను.

అలా ఎంతసేపు గడిచిందో తెలియదు.

"ఆనందరావుగారూ! –"

తల తిప్పి చూసేను.

గుమ్మంలో వొక యువతి.

"ఎవరూ?"

"లోపలికి రావొచ్చా?–"

"–వొచ్చి అడుగుతున్నారు –"

నవ్వింది. కాళ్ళకేసి చూసుకుంది. మళ్ళీ తలుపువాటుకి

వెళ్ళింది. వెలుపల్నుంచి గదిలోకి తొంగిచూస్తున్నట్టు అభినయించింది. "లోపలికి రావొచ్చాసార్?—"

నవ్వకుండా వుండలేకపోయేను—"రండి—"

లోపలికొచ్చిందామె. కూచొమ్మన్నాను, కూచుంది. కాఫీ-టీ-కూల్ డ్రింక్!?—"

"టీ తీసుకుంటాను-"

టీ తెప్పించేను. లేదా, టీ వొచ్చింది. (నా గదిలోకి నాకేవి కావాలంటే అవి వొస్తాయి—)

"చెప్పండి-" అన్నాను.

"నా పేరు కైక—" అని ఆగింది.

"విచిత్రమే" అన్నాను. రామాయణంలోంచి కైక, ఊర్మిళ, మంధర, మండోదరి-ఈ పేర్లు ఎవరూ పెట్టుకోరు-ఎందుకనో—"

"పేరు విచిత్రమేగాని—నేను మామూలు మనిషినే!..."

"నా పాత్రలు మామూలు మనుషులు కావడమే వొక విచిత్రం......"

"అరె—నేను మీ పాత్రనని ఎలా కనిపెట్టేసేరు?..."

అమాయకుల్లా వున్నారు. పాత్రని రచయితలూ, రచయితల్ని పాత్రలూ ఆమాత్రం గుర్తించలేకపోతే ఎలా?—సరే—చెప్పండి.మీమీద కూడా నవల రాయాలా?"

"నామీద కూడా—అంటే?—"

"అది వేరేకథ—చెప్పండి-మీ సంగతేవిటి?—"

"రాస్తే రాయండి లేకపోతే మానెయ్యండి—అందుగురించి నాకు పెద్ద ఆందోళన ఏమీలేదు. ఎందుకో మిమ్మల్ని చూద్దామనిపించింది. మంచి పాత్రలు దొరక్క మీరేమైనా ఇబ్బందిలో వున్నారేమోననిపించింది...సరే—నావల్ల మీకేమైనా మేలు జరుగుతుందేమోనని—"

"వోకె, వోకె. ప్రొసీడ్!......"

"ఇంకా వేరే పాత్రలకేమైనా అప్పాయింట్‌మెంట్లిచ్చారేమిటి? తొందరపెడుతున్నారు!..."

"నే నివ్వడ మేమిటి? పాత్రలే రచయితకి / అప్పాయింట్‌మెంట్లివ్వ కూడదూ? మరీ తొందరేం లేదు-మీ గురించి మీరు ఏమేం చెప్పగలరో నిదానంగా వివరంగా చెప్పండి—" అన్నాను.

కిలకిలమని నవ్వింది కైక.

ఊఁహూఁ—ఆవిడకా పేరు సరిపోయింతని ఎంత ప్రయత్నించినా సరిపెట్టుకోలేక పోతున్నాను.

పల్చటి మనిషి. చక్కటి చాయ. చలాకీ చక్రాల కళ్ళు. నవ్వుకోసం సిద్ధంగావుండే పసితనం వొదలని పెదవులు. "ఈ జీవితంలో సరదా చాలా వుంది—" అంటున్నట్టు వుల్లాసంగా కదిలే ముంగురులు. ఇరవయ్యొక్క సంవత్సరాల కైక—ఈ కైకకీ-రామాయణంలో రాముణ్ని అడవులపాలు చేసిన కైకకీ- పోలిక-లెక్కడైనా వున్నయ్యా?

నవ్వడం ఆపింది కైక.

"నిదానంగా వివరంగా చెప్పను. తొందరగా క్లుప్తంగా చెప్తాను. ఏం-వినలేరా?"—అంది కైక

కాలికేస్తే మెడకూ, మెడకేస్తే కాలికి వేస్తుందిరా ఈవిడ అనుకుంటున్నాను.

"ఏం సార్! మొదలెట్టమంటారా?" అంది కైక.

"అభ్యంతరమేమిటి?—కానివ్వండి-" అన్నాను.

"ఏదీ-మీరు సిగిరెట్టు అంటించండి మరి—"

"మీరు చెప్పడానికీ, నేను సిగిరెట్టు తాగడానికీ సంబంధం ఏమిటి?"

"మీరు వినే మూడ్‌లో వున్నారని అనిపిస్తూవుంటే-నేను నిరాటంకంగా చెప్పగలను-"

గడుసు పిండం. సరే. వెలిగించేను సిగిరెట్టు. 'ఇహ చెప్పండి-"

—అనగనగా ఒక నేను.

ఆ నేను పేరు కైక.

ఆ కైకకి గొప్పరూపం లేకపోయినా మంచి రూపం వుంది. పెద్ద హోదా లేకపోయినా తగుపాటి హోదా వుంది. కన్నతల్లి లేకపోయినా పెంచిన తండ్రి వున్నాడు. కాని ఆ కైకకి ఆశలు మాత్రం చాలా వున్నాయి. ఆశయాల గురించి ఆమెకు అట్టే తెలీదుగాని—బ్రతుకులో బాగా సుఖపడాలని కమ్మటి కోరికలు చాలా వున్నాయి. కైకకి పెద్ద హోదా లేకపోయినా తగుపాటి హోదా వుందన్నానుకదూ? ఆ తగుపాటి హోదాని (లేదా—ఆ హోదాని ప్రసాదించే ఆస్తిపాస్తుల్ని) పంచుకునేందుకు ఆమెకింకా వలుగురు చెల్లెళ్ళున్నారు. భూమ్మీద ఎవరి బ్రతుకులు వారివి. అలాగే ఎవరి కలలు కూడా వారివే! కైక కలల్లోకి ఆమె చెల్లెళ్ళు ఎన్నడూ ప్రవేశించలేదు......

కైక కథనం బాగుంది.

*(ఇంకావుంది)*





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాదలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మకకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410/1 TG

# నటి

శ్రీ టి. రాఘవేంద్రరావు

అందరూ చూస్తున్నారు
ఆడాలి తప్పదు.

అందరి కళ్ళలో మా ఆకలి
కొందరి కళ్ళలో నే జాలి.

అభిమానం ఎప్పుడో చచ్చిపోయింది
అమ్మ మంచాన పడివుంది.

కన్నతండ్రి విషాదంగా నవ్వుతూ
ఫోటో ఫ్రేములో నివసిస్తున్నాడు.

చిన్ని చెల్లెలు చదువు మానేస్తానంది
చిట్టి తమ్ముడు కనీసావసరాలు లేక
దుమ్ముతో ధూళితో నేస్తం కలిపాడు.

తన కిరవై యేళ్ళు
తన యౌవనాని కారేళ్ళు.
తను కట్టుకున్న దుస్తులు
తనువుపై వేలలాడుతున్న గుత్తులు
ఒక్కొక్కటే తను తీసెయ్యాలి.

ఒక్కొక్కరి కోర్కెలూ బుసలు కొట్టాలి,
మృదంగం మారు మ్రోగుతోంది
విహంగంలా తను ఎగురుతోంది.

తనను వెక్కిరిస్తోంది రంగభూమి
తన జీవితానికి దూకరణభూమి.

శరీరం కదిలిపోతోంది తీగెలా
మనస్సు ఘనీభవించింది శిలలా.

కనిపించడంలేదు ప్రేక్షకుల కళ్ళు
వినిపిస్తున్నాయ్ కన్నతల్లి వెక్కిళ్ళు.
సంగీతం పిచ్చిగా అరుస్తోంది
శృంగారం వెర్రిగా కేకలేస్తోంది.
లయ లేదు తన జీవితంలోవలె
శ్రుతిలేదు తన నుదుటి వ్రాతలోవలె.

దీపాలు హరించుకు పోయాయ్
పాపాలు దహించుకు పోయాయ్.

అభిశప్తమైన జీవితం
అభినయానికి అంకితం.



# భూతాల మర్రి

## శ్రీ కొడవంటి లీలామోహనరావు

ఎక్కడినుండో నడుచు కుంటూ
స్వేద ధారలు ఓడ్చుకుంటూ
విడతెగని ఈ నడకకు విసిగిపోయి,
సుఖానికి వాచిపోయి
కన్ను కానని చీకటిలో
ఇక్కడకు చేరుకున్నాను.

చేరుకున్నాను కాని
చేరువలోఉన్న మర్రినిచూచి
జడుసుకున్నాను.
రాకూడనిచోటుకి వచ్చానని
తెలుసుకున్నాను.

ఊడలు దించుకొని
ఊరంత విస్తరించి
నా చేరువకు రాకేం చేస్తావని
దర్పంగా నిల్చొనిఉంది.
పారిపోదామంటే చుట్టూరా చీకటి
ఎక్కడికిపోను ?

ఈ కాలు ఏ అఖాతంలో పడుతుందో
ఏ కాలనాగు మాటునుండి కాటేస్తుందో
ఏ రాయి తన్నుకొని తూలిపడతానో,
ఈ రాత్రికిక తప్పదు
జ్ఞాపకాల డెలీరియంలో
మారణ వేదన.

గుండెగట్టి చేసుకొని విశ్రమించాను.
క్షణమింకా గడవలేదు.
చెట్టంతా ఊగుతోంది.

ఎక్కడదీ ప్రభంజనం ?
ఏమిటి ఈ ఆవేశం ?

కొమ్మల్లో గుబురుల్లో
ఓ ముఖం కన్పిస్తే
రక్తం కరడుగట్టింది.
గుండె ఝల్లుమంది.
పాలివ్వని స్తనాల్ని విడిచి
గుక్కపట్టిన బిడ్డని
ఎండిన కళ్ళలో దీనంగా చూస్తూ
అచేతనంగాఉన్న ముఖం అది

ఇంతలో కెవ్వున కేక
చివ్వున లేచాను.
ఏడవ అంతస్తునుండి
కాలుజారిపడిన
కూలివాని చావుకేక.
కొమ్మలనుండి ఆకులనుండి
ధారలై కురుస్తోంది
కూలివాని మస్తిష్కపు నెత్తురు.

రెండు కొమ్మలు విరిగి పడ్డాయి
చూడగా అవి కొమ్మలు కావు
చక్రాలలో పడి విరిగిన
పనివాని చేతులు.

గుండెలవిసి, నెత్తురుమరిగి
గట్టిగా కేక పెట్టాను.
మిల్లుకూత విన్పించింది.
చక్రాలు హోరెత్తి తిరుగుతున్నాయి.

మిల్లు కూత
చావుకేక
నిట్టూర్పులు
పిల్లల ఏడ్పులు
చెవులు చిల్లులు పెడుతున్నాయి
నేనిక భరించలేను
ఈహృదయస్పందన నాపలేను.

పిక్కబలంకొద్దీ
పరుగెత్తిపోయాను,
కాని
ఎక్కడకు పోను ?
చుట్టూరా చీకటి
కన్ను కానని చీకటి.



# కదలిక

కె. శాంతి, కె. వెంకటస్వామి

ఏమిటో దాగినట్లుంది—
జీవం.
ఎవ్వరో పిలిచినట్లుంది—
మౌనం.
ఎన్నడో విన్నట్లుంది—
గీతం.

ఎప్పుడో కరగినట్లుంది—
రాగం.
జీవంలోని మౌనానికీ
గీతంలోని రాగానికీ
కాలం అందిస్తే అందుకంది కలం !



# ఎడారంత దారిలో...

శ్రీ ఎ. విజయాదత్

నే కలగన్నాను

కళ్ళు తెరిచే కళ్ళు తెరిచే
కలగన్నాను

మృత్యువు మనల్ని మరింతగా పెన
వేస్తుందని విశ్వసించలేనే
లేదనుకుని విశ్వసించి

గాఢ రాగోద్రేకపు పరిష్వంగం
లోని నిత్యవసంతం
అంత శాంతి నివ్వలేదని

నాకు నీవూ, నీకు నేనూ
మనకి మనంగా మేళవించుకున్న
శ్రుతుల్ని

సుడులుగా కళ్ళల్లో తిరిగే
స్మృతుల్ని

పొదుపుగా రెప్పలమధ్య బిగించేసి
పెదవి కొరుక్కుని

మనోరథాన్ని మరోదారికి
మళ్ళించేసి కళ్ళ లొదిలేసాను

అలనాటి
మమతలూ, అసలు మరులే

అంతా దుమ్మూ, ధూళీ
ఎడారంత దారిలో

ఓ నా స్త్రీ
నీ వో ఒయాసిస్సువని

ప్రేమకు అసంకల్పిత ప్రతీకారం
అన్ని వేళలో ప్రేమే కానేరదని

తెలిసొచ్చిన క్షణంలో-నీవు

నీవు
లేనే లేవనుకుని

ఒక్కణ్ణే కలగన్నాను

కళ్ళు తెరిచే

# అక్షయ కళ

**శ్రీ రామా చంద్రమౌళి**

మహానది దారి తప్పిపోతున్నది
సముద్రంలోకి చొచ్చుకుపోవలసింది యిదేమిటి

ఆకాశంలోకి విచ్చుకపోతున్నది
అటేమో మబ్బుల బీళ్ళు
ఇటేమో పండాల్సిన చిరునవ్వుళ్ళు
నేను ఈ విరిగిన వంతెన మీద నిలబడి

దూరంగా
ముళ్ళకంచెకు చిక్కుకుని చిరిగిన గాలిపటాన్ని చూస్తున్నాను

నిన్నరాతి—
తుఫాను ప్రకృతి బాంధాన్ని బ్రద్దలు కొడుతూంటే
గగనం చిల్లిపడి
అగ్నిహవిస్సులో సహారా ఎడారి స్వర్ణసరస్సుగా మారినట్టు

ఓ తీయని జ్ఞాపకం
జ్ఞాపకాన్ని ఓ విరుగుళికగా చేసుకుని

ఆత్మలోకి మింగుతూ
రజత చషకంతో నేను మబ్బులను పిండుకుని తాగుతున్నాను
ప్రాకృశ్శిమాలను
నా చూపుల దారాలతో

నా రధానికి అశ్వాలుగా కట్టి
యిక నేను చేయబోతున్న మహాయాత్రకు

దారితప్పిపోయిన పక్షి గొంతులో కత్తులతో
నేపధ్య సంగీతాన్ని వినిపిస్తోంది

ఈ రధంలో...నీకూ...నీకూ...నీకూ,
జీవితాన్ని పన్నీటితో కడుక్కుంటున్న అందరికీ చోటుంది
నేను- పగిలిన అద్దాలను

క్షమాకాంతితో అతికించే
అక్షయకళను నేర్చుకున్నాను.



# చిటారు కొమ్మన మిఠాయి పొట్లం!

ఆశయం ఎప్పుడూ ఎత్తులోనే వుంటుంది.

చెట్టెక్కే సాహసం చేసిన వాడికే పండ్లు పుష్కలంగా దొరుకుతాయి.

ఈనాడు ఆసాహసమే 20 సూత్రాల పథకం.

ఒక ఆశయం నెరవేరితే యింకోటి తయారవుతుంది. ఒక లక్ష్యం సిద్ధిస్తే మరో లక్ష్యం.

కోర్కెలు చంపుకుంటే ఆనందం వుందన్నారు ఆరోజుల్లో వ్యక్తికైనా, సమాజానికైనా అవసరాలు, కోర్కెలు తీరితేనే ఆనందం యీ రోజుల్లో. అదే సోషలిస్టు లక్ష్యం.

ఇరవై సూత్రాల పథకం పూర్తిగా అమలు జరిగిం తర్వాత యింకో యిరవై సూత్రాల పథకం వస్తుంది.

ఇది నిరంతర ప్రయాణం. అందులో యిది తొలి మజిలీ.

సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు.

8/76/తెలుగు

# పెంజీకటి కవ్వల.....

## శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

తొలుత ఆ వూరు చిన్నదే అయినా రెండు ఆర్ట్స్ కాలేజీలూ, ఇంజినీరింగ్ కాలేజీ, చిన్నతరహా పరిశ్రమలూ వచ్చాక, పల్లెలనుంచి వలస వచ్చే జనంతో అనేకమైన కాలనీలు పెంచుకుంటూ బాగా విస్తరిల్లింది. ఆ కాలనీల్లో శ్రీనగర్ కాలనీ ముఖ్యమైనదీ, అందమైనదీ, చెప్పుకోదగినదీను. ఊళ్ళోవుండే సంపాదనాపరులూ, నాలుగంకెల జీతాలవాళ్ళూ అక్కడే వుంటారు. అంత సంపాదన లేకపోయినా వున్నట్లు కన్పించాలనుకునేవాళ్ళూ, రిటైరైన పెద్ద ఉద్యోగస్థులూ కూడా అక్కడవున్నారు.

అక్కడుండే మేడలు మామూలు మనుష్యులు కట్టుకునే ఆశల మేడలు. అక్కడ నివసించేది సామాన్యుడు కోరుకునే కోరికలూ, కనే కలలూను. ఆ విషయం అక్కడుండేవాళ్ళకూ తెలుసు. అందుకనే యింకా ఎక్కువగా మనుష్యులు ఊహించుకునే స్వర్గంలోని దేవతల్లాగా ఉండటానికి శాయశక్తులా కృషిచేస్తారు. ఇతర మనుష్యుల ఉనికిని వారు గుర్తించరు. సగంమంది అమెరికాకో, ఇంగ్లండ్‌కో, కెనడాకో, ఆస్ట్రేలియాకో వెళ్ళి వచ్చినా వున్నారు, లేక వాళ్ళ బంధువులెవరో ఆ దేశాల్లో వున్నారు. మిడిల్ ఈస్ట్‌కూ, సౌత్ ఈస్ట్ ఏషియాకూ వెళ్ళి వచ్చినవాళ్ళు ఆ విషయం పెద్దగా చెప్పుకోలేరు. ఫారిన్ రేడియోగ్రాంలూ, ఇంపీరియల్ బ్లెండర్లూ సామాన్య విషయాలు. ఇల్లాండ్రు నెలకో పట్టుచీర విధిగా కొంటారు. ఒకనెలలో [illegible] జరీబార్డరుంటే యింకో నెలలో నెమళ్ళు, మరో నెలలో చెట్లు, తరువాతి నెలలో దేవాలయాలూ యింకా చిన్న విచిత్రాలూ వుంటూ వుంటవి ఆ చీరల్లో. వస్తువులు కొనటం వాళ్ళకు ఎలా తప్పనిసరో ఆ ఖరీదైనవి మరచిపోవటంకూడా తప్పనిసరియైన విషయమే. సామాన్యులకుండే ఈతిబాధలు–గయ్యాళి అత్తలు, ఆడబిడ్డలు, సరిగ్గా చూడని మొగుడు, జబ్బులు లాంటివికూడా వాళ్ళకు వున్నట్లు పైక్కడా కనబడవు.

ఇటువంటి మనుష్యులుండేచోటు దేవలోకం కాకుండా ఎలా వుంటుంది? అయితే దానికీ ఒక చిన్నలోటుంది. ఆ కాలనీ వెనకనే, దాని గోడల క్రిందనే ఆనుకునివుండే స్మశానమే ఆ లోటు. కాలనీ దాని వేపుకి వీపు త్రిప్పి వుంటుంది. మొదటి వరుస యిండ్లకు పెరటి వేపుకు వెళితే బాగా కనిపిస్తుంది – బాగాలేకుండా కనిపిస్తుంది.

అక్కడికి రోజూ రెండో, మూడో పీనుగులు తప్పెట్లతో వస్తుంటాయి–మట్టై, మసైపోవటానికి. శీతాకాలంలోనూ వూళ్ళో ఏవైనా వ్యాధులు వ్యాపించినప్పుడూ ఒక్కోనాడు పది కూడా వస్తాయి. తీరిక వేళల్లో ఆ యిళ్ళలోని పనివాళ్ళూ, వంటవాళ్ళూ మాత్రం వెనుక దొడ్లలో చేరుతారు. శవం వృత్తాంతం తెలిసినదీ, ఊహించుకున్నదీ ఒకరితో ఒకరు చెప్పుకుంటూ చూస్తూ నిల్చుంటారు. 'విశేషమైన' శవం వచ్చినప్పుడు గోడలమీద ఎక్కి కూర్చుని అవతల ఏడ్చేవాళ్ళనో, ప్రక్కన నిలుచున్నవాళ్ళనో పిలిచి సావకాశంగా మాట్లాడి విషయమంతా వివరంగా కనుక్కుంటారు. వీలున్నంతసేపు అక్కడ నిల్చుని చూస్తారు. అది రోజూచూసే 'పాడే' అయినా, అదేదో గొప్ప రసవత్తరమైన విషయమైనట్లు మళ్ళీ అక్కడికి చేరుతూనే వుంటారు వాళ్ళు. యజమానులు మాత్రం అటువైపురారు. పూడ్చే శవాలైతే వాళ్ళకేమీ సంబంధం వుండదు. కాల్చేవాటితోనే చికాకు. ఒక్కోసారి ఏమరుపాటున సంజె వెలుగుల్ని చూచిన 'అమ్మ'గార్లు వాటిని కాష్ఠ జ్వాలలని రుజువుకొని తలుపులు మూయడంకద్దు. శవం ముప్పాతిక కాలిన తర్వాత కమురుకంపు పైకెగసి గాలిలో కలసి కాలనీలోని యిళ్ళన్నిటినీ చుట్టివేస్తుంది. ఆ విషయం ముందే తెలుసు గనుక వంటవాళ్ళు తలుపులు, కిటికీలు ముందుగానే మూసేస్తారు. ఎక్కడైనా ఒక తలుపుగాని, కిటికీ రెక్కగాని తెరచుకొనివుంటే కమురుకంపు యింటిలోపల ప్రవేశించి యింటిలోని వాళ్ళను ఉక్కిరి బిక్కిరి చేసి వేస్తుంది. ఆ వూళ్ళో ఎలక్ట్రిక్ క్రెమటోరియం వెలిసేవరకు యీ దేవలోకానికి యీ బాధతప్పే అవకాశంలేదు!

ఆ మొదటి వరుసలోనే ఒక యింట్లో డాక్టర్ సీతారామారావుగారు వుంటారు. ఆయనైతే అక్కడుండాలని అనుకోలేదు. ఊరి మధ్యలో వుంటేనే ఆయన క్లినిక్కూ, కూతురు రాధిక కాలేజికీ దగ్గర, అనుకూలం. కాని ఆయన భార్య జయలక్ష్మి పట్టుదలవల్ల అక్కడున్నారు. ఆవిడ అక్కడే వుండాలని ఎందుకనుకుందో ఆవిడకే తెలియదు. ఆమెకూ కాలనీ మనస్తత్వానికీ ఆమడదూరం. స్వతహా చాలా నిరాడంబరంగా వుంటుంది. 'పిచ్చి'గా వుంటుందని అనేవాళ్ళూ ఉన్నారు. ఆమెకు ధనవంతులంటే సద్భావనూ లేదు. అక్కడే వుండటానికి కారణం ఆమె కూడా చెప్పలేదు.

తానుచేసే ఏ పనికిగాని ఖచ్చితమైన కారణం చెప్పగల మనస్థిమితం ఆమెకు లేదు.

ఒక్కొక్కసారి ఆమెకు చాల సంతోషంగా వుంటుంది. అకారణంగా మనసు ఉత్సాహంతో ఎగసిపడుతుంది. భర్త మీద, బిడ్డలమీద, కనిపించిన ప్రతి ప్రాణిమీదా ప్రేమ పెల్లుబికి వస్తుంది. జీవితంలో అర్థం సారం నిండుదనం తోస్తవి. తాను పూజించే లక్ష్మీదేవి కళ్లలో ప్రసన్నత కనిపిస్తుంది. మనస్ఫూర్తిగా నమస్కారం చేస్తుంది. ఏమిటో అందరానిది అర్థంఅయిపోయినట్లనిపిస్తుంది. ప్రేమ, ఆనందం, అర్థం, దేవుడు, జీవితం—అన్నీ ఒకటే అనుకుంటుంది

ఒక్కొక్కసారి జీవితం నిస్సారంగా, నిరర్థకంగా కనిపిస్తుంది. భర్త, బిడ్డలు, లోకంలోని ప్రతిబంధమ్మూ అవసరాలకు పరిమితమైనదిగా, స్వార్థపూరితంగా తోస్తుంది. మంచితనం, దయ, ప్రేమ అన్నీ మోసం అనుకుంటుంది. మనసులో నిస్పృహ నిండిపోతుంది. ఈ అర్థంలేనితనం ఆమెను కృంగదీస్తుంది. అటువంటి సమయంలో తాను పూజించే లక్ష్మీదేవిని చూచి 'కాగితంమీద అచ్చుకొట్టిన ఒట్టి బొమ్మ' అనుకుంటుంది. పాతబడి రంగులుమాసిపోతున్న ఈ కాగితంచూచి అందులో ఏదో వెలుగును, భావాన్ని, ప్రాణాన్ని, కృపను, ఆశీర్వచనాన్ని, శక్తిని ఎట్లా చూడగలిగాను? అని ఆశ్చర్యపోతుంది. కిటికీలోనుంచీ పడే వెలుగు ఏదో కోణంలో నుంచీ పడినప్పుడు ఏదో అస్పష్టతలోనుంచీ కలిగే భ్రమ అనుకుంటుంది అస్పష్టంగా.

పట్టు, స్పష్టత అనేవి లేనట్లు చలించిపోతుండే ఆమె మనస్సు ఎప్పుడూ లోపల దేనికోసమో వెతుక్కుంటూవుంటుంది. దేన్నోపట్టుకోవాలన్న నిరంతర ప్రయత్నంలోవుంటుంది. ఎవరితో మాట్లాడకుండా, ఏమీ చెయ్యకుండా ఒంటరిగా కూర్చొని దాన్ని వెతికి పట్టుకోవాలి! జీవితానికి అర్థం లక్ష్యంఅయి, అతిముఖ్యమైన 'అది' క్షీరార్ణవశాయి అయిన విష్ణువులాగా దుఃఖసముద్రం మధ్యన అందరాకుండ నిలిచివున్నది. దాన్ని పట్టుకోవాలి! పట్టుకోవాలి! ఆమె మనస్సు ఉద్వేగంతోచలించిపోతుంది...ఏమిటది? నన్ను బ్రతకనివ్వకుండా, ఊపిరాడనివ్వకుండా లాక్కుపోతున్నది, ఏమిటది? మృత్యువా? అనుకుంటుంది. అటువంటి సమయాల్లో ఆమె ఏవరితోనూ పలకదు. పూరికే అర్థంలేని చూపులు చూస్తూ కూర్చుంటుంది. శ్రావ్యమూ, దుఃఖభరితమూ అయిన సంగీతాన్ని ఏమాత్రమ్మూ భరించలేదు. అది ఆమెను యీ వెతుకులాటనుంచీ బలవంతాన ఈడ్చుకొస్తుంది. ఆమె జీవితంలోఏర్పడిన బంధాలు, దిగంతాలకు వ్యాపించిన తీయదనాలు—విరుగరాని ఆనందానికి సంకేతాలు—అమూల్యమైనవి అన్నీ ఆ దుఃఖసముద్రంలోకి అయిపోతాయి. భరింపరాని బాధావేశం గుండెను చీల్చుతుంది. ఏ పని చెయ్యనివ్వని నిస్సత్తువ ఆమెను ఆవరిస్తుంది. అటువంటప్పుడు ఎవరు పలకరించినా పట్టరాని కోపం వస్తుంది. 'ఎప్పుడూ మీ కందరికీ వేళకి తిండీ, బట్టలూ అందిస్తూ కూర్చోవడమేనా నాజీవితానికి పరమార్థం? మీరునన్ను పీక్కుతినేస్తున్నారు. నా రక్తం తాగేస్తున్నారు' అంటూ విరుచుకపడుతుంది. 'ఏం, పనెక్కువనుకుంటే వంటమనిషిని పెట్టుకుందాం' అంటాడు సీతారామారావు. పని ఎక్కువ అవడమేమిటి? అసలు పని అనేదే ఎక్కువ. ఏపనైనా ఎందుకు చెయ్యాలి? 'అవును. నాకు ప్రతి పనీ ఎక్కువనే అనిపిస్తున్నది. ఏపనీ జెయ్యకుండా వూరికెనే వుండాలనిపిస్తున్నది. చావాలనిపిస్తున్నది' అంటుంది కసిగా...కొంచెం చల్లబడ్డాక 'నాకు వాళ్లంటే ప్రేమ. వాళ్ళకు అన్ని సౌకర్యాలూ కావాలనే చేస్తున్నాను. ఇష్టంతోనే చేస్తున్నాను. మరి ఎందుకు అట్లా మాట్లాడుతాను' అనుకుంటుంది.

ఒక్కసారి ఉన్నట్లుండి ఆమెలో ఏదో భయం పుట్టుకొస్తుంది. ఏదో పోతున్నదన్న బాధ ఉవ్వెత్తుగా పొంగివస్తుంది. భర్త, పిల్లలూ అందరూ బాగున్నారనివరుసగాగుర్తుచేసుకున్నాకనే అది శాంతిస్తుంది. 'వాళ్ళమీది మమకారం ఒక్కటే నాకు జీవితంలో మిగిలింది. అదే నేను బ్రతకటానికి కారణం. అదే లేకపోతే నేను చెదిరి నాశనమైపోతాను...దేవుడనేవాడుంటే అట్లా ఎన్నటికీ జరగదు, జరక్కూడదు.........వాళ్లకు ఏమైనా జరిగితే... వాడు దేవుడేకాదు! వాడు నాశనమైపోతాడు! వాడి సృష్టి మసైపోతుంది. వాడు ...

నేనెందుకిలా ఆవేశపడిపోతున్నాను?! అందరూ బాగనే వున్నారు. భగవంతుడిని శపించుకుంటూ వున్నానెందుకు?... ఈ రకంగా సాగిపోతాయి ఆమె ఆలోచనలు...

## 2

ఇరవైఏళ్లు కలిసిజీవించినా జయలక్ష్మికి భర్త స్వభావం అర్థంకాలేదు. ఆమె ఆలోచనలకు కేంద్రం ఉత్తరధృవమైతే, ఆయన మాటలు దక్షిణధృవంనుంచీ వచ్చినట్లనిపిస్తాయి. సరిగ్గా ఆమె అనుకునేదానికి వ్యతిరేకంగా మాట్లాడుతాడు. కావాలని ఉద్దేశపూర్వకంగా అట్లా మాట్లాడుతాడని మొదట అనుకుంది. కాని, ఆయన స్వభావం, తన స్వభావం పూర్తిగా వేరని తర్వాత అనుకుంది, అయినా ఆయన ప్రతిమాటకీ కోపం తెచ్చుకుంటుంది. ప్రతి సంభాషణా చికాకులోనే అంతమౌతుంది. ఆయన ఆమెకు అర్థంకానేకాడు!

అతను డాక్టరుగా వృత్తిలో ఎక్కువ సంపాదించలేదు దానికి ఒక కారణం అతని నిబ్బరం. ఎవరికైనా జ్వరం రాగానే అదేదో విషజ్వరం కావచ్చునుకునో, పేరు సంపాదించాలనో, దాన్ని వెంటనే తరిమెయ్యాలని, క్రొత్తవైన పెద్ద మందులు శరీరాన్ని అతలాకుతలం చేసేవాటిని గబగబా యిచ్చెయ్యడు. రెండోకారణం అతను ప్రతి వాళ్లనూ ఖచ్చితంగా యింత డబ్బివ్వాలని నిలవెయ్యడు. అట్లాచేస్తే

జబ్బు ముంచుకొస్తేవరకూ వాళ్ళు డాక్టరు దగ్గరకు రారుగనుక. ఈ కారణాలవలన పూరికే మందులు తీసుకెళ్లేవాళ్ళే అతని దగ్గరకు జాస్తిగా వస్తారు. ఈ రెండూ కారణాలూ జయలక్ష్మికి అర్థమయ్యేవే. ఆమె హర్షించేవే. అయినా మాటమీద మాటవచ్చినప్పుడు 'పెళ్లాం డబ్బు తేరగావస్తుందని, కష్టపడకుండానే మంచిపేరు సంపాదించొచ్చని కనిపెట్టారు. అంతే' అనకుండా వుండదు.

పెద్దకూతురు రాధికకు పదహారేళ్ళు. బి. యస్సీ. చదువుతున్నది అరటిబోదెలాగా నవనవలాడుతూ ఏపుగా పెరిగింది. చురుగ్గా, ధీమాగా, ఆకర్షణీయంగా వుంటుంది. చదువులో మంచి తెలివితేటలుగలది తన కోరికలకూ, ఆశయాలకూ, మూర్తికట్టినట్లున్న రాధికను చూసి పొంగిపోతుంది జయలక్ష్మి. ఆరేళ్ళ చిన్న కూతురు చంద్రికను చూచినప్పుడు ఆమెకు గుండె చెరువైపోతుంది. లక్ష్యంలేని ఆవేశం పెల్లుబుకుతుంది. అది వెర్రిపిల్ల. మెదడులో ఏర్పడిన ఏదో లోపంవల్ల తెలివి పెరగలేదు. శరీరం అర్భకంగా వుండి మూడేళ్ల పిల్లలాగా కనిపిస్తుంది. ఎప్పుడో ఒక మాట మాట్లాడుతుంది. నోట్లోంచి నిరంతరం చొంగకార్చుకుంటూ, నవ్వుతూ అందరి దగ్గరకూ వస్తుంది బయటివాళ్ళు భయపడతారు. వాళ్ల ముఖాల్లో చీదరింపు కనిపిస్తుంది. ఇంట్లోవాళ్ళు 'ఫో, ఫో' అంటారు. అన్నీ చూస్తున్న జయలక్ష్మికి జాలి. దుఃఖం, కోపం అన్నీ ఒక్కసారె కలుగుతవి. 'ఎందుకీపిల్ల యిట్లాపుట్టింది? అదేం చేసిందని దానికీ శిక్ష? అమాయకుల్ని యింత క్రూరంగా శిక్షిస్తున్నాడెందుకు ఆ దేవుడు?' అని తిరిగి తిరిగి ప్రశ్నించుకుంటుంది. ఆఖరికి కోపం పట్టలేక దానిని ఏ సాకుతోనో కసిరి తిట్టి, కొట్టి కళ్లముందునుంచి తరిమేస్తుంది.

సీతారామారావు చంద్రికను గురించి పట్టించుకోడు. దగ్గరికొస్తే మెడలోని బిబ్‌తో మూతి తుడిచి, వీపుతట్టి 'ఆడుకో ఫో' అంటాడు. రంగుల పేక ముక్కలో, బొమ్మల కాగితమో ఏదో ఒకటిస్తాడు, దాన్ని తీసుకుని ఆనందంగా వెళ్ళిపోతుంది అది. చంద్రికపట్ల చూపబడే యీ ఆదరణకి లోపల చాలా సంతోషిస్తుంది జయలక్ష్మి. భర్తఎడల ప్రసన్నత, కృతజ్ఞత కలుగుతుంది. 'అయ్యో, అందరూ దాన్ని అసహ్యించుకుంటున్నారే...ఈ కునిష్టి బతుకు ఏలా బతుకుతుంది? ఎలా పెద్దవుతుంది?' అన్న ఆవేశం కలిగినప్పుడు మాత్రం అతని నిశ్చింతకు చాలకోపం, దుఃఖం వస్తాయి. 'పిల్ల యిట్లావుంటే మీకు చీమకుట్టినట్లున్నాలేదే! కనీసం పిల్లలమీదైనా మీకు అక్కరలేదే! నేనింత బాధపడుతున్నాను. మీరు బెల్లంకొట్టిన [illegible]లాగా కూర్చుంటారు. ఈ బాధ్యతంతా నేనేమొయ్యాలసిందేనా? [illegible] మండిపడుతుంది...ఇలా ఘాటుగా మాట్లాడుతూవుండగానే [illegible]ంతా నటన, ఈ మాటలన్నీ ఊరికెనే అంటున్నాను. అంతా అసత్యం' అనిపిస్తుంది మనసులో. చంద్రికమీది అక్కర, రాధికమీది ప్రేమ అన్నీ తాను చేసేవి. ఊహించుకునేవి. ఆడేవి. అవీ, తానూ ఒకటికాదు. అన్నీ అసత్యమే! ఆమెకు భయంవేస్తుంది. ఆలోచన అబద్ధం; బతుకు అబద్ధం; ప్రపంచం అబద్ధం! భయంతో, సందేహంతో యింకా గట్టిగా అరుస్తుంది—'పిల్లలంటేకూడా అక్కరలేని మనిషి, ఏం మనిషి మీరు! మీదగ్గర నిజంలేదు!' అని.

ఇటువంటి ఆవేశాలు, కల్లోలాలు, లేనిసమయాల్లో ఆమె మనస్సు నిద్రపోతున్న పాములాగా స్తబ్దంగా మత్తులో వుంటుంది. ఏపనీ చెయ్యనివ్వదు. చిన్నపని కూడా బలవంతాన చేయించాల్సిందే.

ఏడాదిక్రితం కరెంట్ షాక్ కొట్టినప్పటినుండి ఈ స్థితి మరింత తీవ్రమయింది. ఇనపతీగెమీద మామూలుగానే తడి టవలు ఆరవేద్దామని వేసింది. ఎక్కడో లీకేజివుండి ఆ తీగెలోకి వచ్చివుండిన కరెంటు ఆమెను పట్టుకుంది. భయభ్రాంతిలో శరీరానికీ, మనస్సుకీ సంబంధం తప్పిపోయింది. 'అమ్మో' అన్న పొలికేకపెట్టి పడిపోయింది...ఆ తీగె తెగిపోకుంటావుంటే అప్పుడే ప్రాణంపోయుండేదన్న విషయం భయంకరంగా ఆమె మనసును పట్టివేసింది. చావు, బతుక్కీ యింత దగ్గర్లోవుందేమిటి? అయ్యో, ఎంత దగ్గర్లోవుంది! దాన్నుంచి ఎక్కడికి ఎలా పారిపోవాలి??

చావు, రోగం, బాధ, కష్టం — యిటువంటివన్నీ ఎందుకున్నాయి? వాటి బారినుండి తప్పించుకోడానికి మార్గమేలేదే!?

జయలక్ష్మికి ఏడో ఏట వాళ్ళతాత చనిపోయాడు. ఆయన ఎప్పుడూ అబద్ధం ఆడలేదు. ఆరునెల్లు మంచంలోవుండి, ఆఖర్న 'అదుగో, నాకోసం విమానం వచ్చింది' అంటూ ప్రాణం ఒదిలాడు. తాతకి లక్ష్మి అంటే ప్రాణం. లక్ష్మికి తాత మంచితాత. తాత జబ్బుగా వున్నప్పుడు రోజూ మధ్యాహ్నం వేళల్లో ఒక చేత్తో ముక్కు మూసుకుని, మంచంలో తాతప్రక్కనే కూర్చుని విసనకర్రతో విసిరేది. అత్తయ్యవచ్చి 'ఏమేపిల్లా, మీ తాతకి నీవంటే ప్రాణం. నీవేమో తాతని అసహ్యించుకుంటూ ముక్కుమూసుక్కూర్చున్నావు. శీలాల మారిదానా!' అన్నది. 'నాకూ తాతంటే యిష్టం. అందుకే విసురుతున్నాను'. 'మరి ముక్కుమూసుకున్నావే' వాసనుంటే ముక్కు మూసుకోరా? అత్తయ్యమాటలు లక్ష్మి కర్థంకాలేదు. ...తాతయ్య చచ్చిపోయాడు. అందరూ ఏడ్చారు. లక్ష్మి ఏడవలేదు. అత్తయ్య పిలిచి దగ్గరకూర్చోబెట్టుకుని 'తాత చచ్చిపోతే ఏడుపన్నారాలేదే నీకు...తాత యిహ లేడు' అన్నది. 'అదుగో తాత' 'ఈతాత చచ్చిపోయాడు. ఇహ కాల్చేస్తారు' 'పోనీ కాల్చెయ్యొద్దులే' 'ప్రాణం పోయాక శరీరం నిలవదు. కుళ్లిపోతుంది...ప్రాణంలేనికట్టె ఏందుకు?' 'ప్రాణం ఎక్కడికి పోయింది?' 'దేవుడిదగ్గరికి'. దేవుడిదగ్గరకుపోతే ఎందుకేడవటం? అత్తయ్య ధోరణి లక్ష్మికర్థం కాదు. తాతయ్య కోసం విమానం వచ్చింది, వెళ్లిపోయాడు. లక్ష్మికి ఏడుపురానేలేదు.

తాతయ్య దేవుడిదగ్గరున్నాడు బాధకలిగినప్పుడు. భయంవేసినప్పుడు ఏకాంతంలో దేవుడిదగ్గరున్న తాతయ్యకు చెప్పుకునేది లక్ష్మి. చాల కాలంవరకూ చెప్పుకున్నది.. కాని యిప్పటి జయలక్ష్మి వేరు. ఈమెకు చావు అర్థంకావటంలేదు చావంటే భయం. విపరీతమైన భయం.

## 3

ఊళ్ళోకి సిటీ సర్కస్ వచ్చింది. అందరూ పిల్లల్ని సర్కస్‌కు తీసుకుపోయి చూపించుకుని వస్తున్నారు. కొంచెం పెద్దపిల్లలు 'దాంట్లో ఏం తమాషావుంది ? అంతకంటె సినిమాచూస్తే ఎంతో బాగుంటుంది' అంటున్నారు. ఏనుగు స్టూలుమీద కూర్చుంటే ఎందుకు సంతోషం ? పులి తాడుమీద నడిస్తే ఎవరికేం ఒరుగుతుంది ? మనుషులు ఎంతపైన ఉయ్యాలలూగితే మనకేమిటి ! సినిమాల్లో వీటి తాతల్లాంటివి చూపిస్తారు... సర్కస్ ఏమంత గొప్పగా లేదు గాని, అందులో ఒక బఫూను ఆడవేషం వేసుకుని మగ బొమ్మతో డాన్సుచేస్తాడు. చీరా, రైకా, పావడా అన్నీ విప్పేస్తాడు. అది భలే తమాషాగావుంది అంటున్నారు.

రాధిక బలవంతాన జయలక్ష్మికూడా వెళ్ళింది.

ఆ పిల్లకు ఆరేళ్ళుంటాయేమో, రంగం మీదకు వచ్చింది. చిన్న మెరిసే బెల్టు తప్ప వేరే బట్టలేమీలేవు. ఆచ్ఛాదన లేకుండటాన ఆ పిల్ల పసితనం మరింత స్పష్టంగా తెలుస్తున్నది. సరైన పట్టు లేకుండా నిలబెట్టిన సన్నని గెడమీదికి పాక్కుంటూ వెళ్ళి పైన ఫీట్స్ చేసింది. టేబిల్‌మీద నిల్చుని ఒంట్లో ఎముక అనేది లేదేమో అన్పించేటట్టుగా ఒళ్ళంతా రకరకాలుగా వొంచి చుట్టేసేసింది. ఒక్కో చుట్టు తిప్పడం అవగానే లేచి నిల్చుని, ఒక ఘనకార్యం చేసినట్లు మొహంనిండా నవ్వుపెట్టుకొని ప్రేక్షకులవైపు చూసి చెయ్యూపిస్తున్నది. మీరు 'చెయ్యలేని పనిని నేను చేశాను. అది చూడ్డానికి మీరు వచ్చారు. మీరు చూడాలని యింతదూరం వచ్చిన పనిని నేను చేశాను!' అన్నట్లు చెయ్యి వూపుతున్నది పిల్ల. కాని ప్రేక్షకుల మొహాల్లో నవ్వులేదు, ఆశ్చర్యంలేదు, కరతాళ ధ్వనులు లేవు రాతి బొమ్మల్లా కూర్చుని ఊరుకుంటున్నారు. 'ఆ పిల్ల యింక ఎంతసేపు అలా గర్వంగా నవ్వగలదు?' అనుకుంది జయలక్ష్మి.

ఒక టేబిల్‌మీద నాలుగు సీసాలుపెట్టి వాటిమీద చదరపు పలక పెట్టారు. పిల్ల దానిమీద ఎక్కింది. పలక నాలుగుమూలలా మరో నాలుగు సీసాలు పెట్టి యింకో పలక పెట్టారు. జాగ్రత్తగా బాలన్సు చేసుకుంటూ దానిమీద కెక్కింది. ఇట్లా నాలుగు పలకలు పెట్టారు పిల్ల పైపైకి వెళ్ళిపోతోంది. నాలుగో పలకమీద మూడు సీసాలుపెట్టి త్రికోణపు పలక పెట్టారు. చాల జాగ్రత్తగా దానిపైకి ఎక్కింది. సీసాలు పెట్టే మునలాయన పిల్ల అంతెత్తునుంచీ పడిపోతే పట్టుకోడానికి అనువుగా చేతులు పైకిచాపి, ఏమరకుండా చూస్తూ ప్రక్కనే నిల్చున్నాడు. పిల్ల ఆపైన నిల్చుని ఒళ్ళంతా చుట్లు తిప్పింది అన్నీ పూర్తిచేసుకుని నిల్చుని చెయ్యాడించింది. ప్రేక్షకుల్లో చలనంలేదు. ఒక బఫూన్‌వచ్చి 'చప్పట్లు కొట్టండి,కొట్టండి' అంటూ చప్పట్లుచరిచి చూపాడు. అందరూ నవ్వుతూ అందుకొని చప్పట్లుకొట్టేశారు ఆ పిల్ల చేస్తున్నంతసేపూ జయలక్ష్మికి పిల్ల పడిపోతుందేమో నన్న భయం. ఆ భయంలోనే ఎందుకో 'ఆ పిల్లకొక మెరిసే గౌను తొడిగిలేరేం?' అనుకుంది చాలాసార్లు 'పసిపిల్ల. పొరపాటున పడిపోతే అవిటిదయిపోతుంది. అవిటిదనం భయంకరమైనది. పసిపిల్లచేత ఎవరూ మెచ్చని యీ పనులన్నీ ఎందుకు చేయిస్తున్నారు? మీ డబ్బులు మీ కెలాగూ వస్తాయి గాని ఆ పిల్లచేత చేయించొద్దు' అని మేనేజిమెంటుతో చెప్పాలనీ, రంగంపైకెక్కి అరవాలనీ అనిపించింది జయలక్ష్మికి.

'ఎక్కడికి వెళ్ళినా దుఃఖపడటానికి ఒక కారణం కనబడుతుంది అమ్మకి' అన్నది రాధిక నవ్వుతూ.

అందరూ ఎందుకు దుఃఖపడటంలేదు? ఆ సర్కస్ పాపతో మనకు సంబంధంలేదు. ఆ పిల్ల అవిటిదయిపోతే మనం దుఃఖపడం. ఆ పిల్ల భవిష్యత్తుగురించి మనం ఆలోచించం. వాటిని నేర్చుకోడానికి ఎంత శ్రమపడిందో మనకక్కర్లేదు. ఆ పిల్ల తీసుకుంటున్న రిస్క్‌తో మనకు సంబంధంలేదు. అందుకే ఆ పిల్ల చేస్తున్న పనుల్లో మనకు ఉత్సాహంలేదు. మామూలుగా చేసేవి చేస్తున్నది, అంతేకదా అనిపిస్తుంది. ఏనుగుయొక్క సహజ గాంభీర్యమూ, అడవికి రాజువంటి పులి స్వభావంలోని రాజసమూ మనకు తెలియదు అందుచేతే కనికట్టులాంటి సినిమా దృశ్యాలకీ,దీనికీ పోల్చి సాహసిస్తున్నాం. ఎదుటి ప్రాణితో 'సంబంధాన్ని' కోల్పోయి ప్రాణులన్నిటిలోకీ హీనజాతి అయిపోతున్నాం...ఒక శరీరంలోని సహజమైన కణాలన్నిటిమధ్యనా ఒక ప్రాణం, ఒక నియమం, ఒక సంబంధం వుంటుంది. సంబంధం తప్పిపోయినవి అసహజమైన కాన్సర్ కణాలై పూరికే అస్తవ్యస్తంగా పెరిగిపోయి శరీరాన్నే నాశనం చేస్తాయి ..ఈ మానవజాతి కూడా ఎదుటి మనిషితోనూ, అతని సుఖదుఃఖాలతోనూ, కష్టనిష్ఠూరాల లోనూ సంబంధం కోల్పోవడాన రోగగ్రస్తమైపోతున్నది!...స్వామీ మానవజాతిని ఒక కాన్సర్ పుండుగా మార్చకు. ఏదో నవ్వే మనుష్యులుగా, ఎదుటివాళ్ళను అర్థంచేసుకునే వాళ్ళుగా వుండనీ!

ఇంటికొచ్చేసరికి చంద్రిక హాల్లో ఒక గజ్జికుక్కతో ఆడుకుంటున్నది. పసిపిల్ల కూచ్చుని నిద్రపోతున్నది. ఇంటినిండా కమురు కంపు. ఎవరి శరీరమో స్మశానంలో కాలిపోయింది దంపు చావు అశుభం–భయంకరమైనది తలచరానిది ఇంట్లో దూరింది.

జయలక్ష్మి పనిపిల్లని తిట్టి లేపింది. గజ్జికుక్కనుకొట్టి తరిమేసింది. చంద్రికను చూస్తే కోపం, దుఃఖం పట్టరాకుండా వచ్చేశాయి, ఎడా పెడా బాదేసింది. చేతులు నొప్పిపుట్టేవరకూ బాదింది. సీతారామారావువచ్చి ఏడుస్తున్న పిల్లను దగ్గరకు లాక్కునేవరకూ కొట్టింది...

"ఎందుకు దాన్నట్లా చావగొడతావు?" అన్నాడతను కోపంగా. అతనికి కోపం రావటం అరుదు.

"ఎందుకా? ఎందుకా?!...అది అట్లా మురికి కుక్కల్తో ఆడుకుంట్లూ—బుద్ధి లేకుండా వుండటం సహించలేను. అందుకని!" అన్నది.

"అది దాని పుటక. కొడితే మారుతుందా? మారదు! మారక పోతే నీకు అక్కర్లేదా? అది బతికుండాలని నీకు లేదా ?"

ఎందుకులేదు? అదేం ప్రశ్న! అది బతికుండాలనీ వుంది., బాగుండాలనీ వుంది. అందుకనే యీ పరిస్థితిని సహించలేక బాధ పడుతున్నాను. ఎంతమాటను ఎంత సులువుగా అడిగారు! జయలక్ష్మికి కడుపులో మంటపుట్టింది.

"అది ఎట్లావున్నా మీకు ఫరవాలేదు; అదేమైపోయినా మీకు ఫరవాలేదు. అందుకే నింపాదిగా సూత్రాలు మాట్లాడుతారు. అది బాగుండాలనుకునే వాళ్లైతే, అక్కరగలవాళ్లయితే మీకూ బాధ పుట్టేది" అన్నది.

అతను సమాధానం యివ్వనవసరంలేనట్లు వూరుకున్నాడు. అనుకున్నమాటలు అనేస్తాడు. ఇహ ఏమన్నా సమాధానం యివ్వడు. ఆ మౌనం వలన అతనిమాటలు నిజమై పోతున్నట్లు ఆమెకు బాధ కలుగుతుంది. అతనన్నమాటలు ఆమెను వరిపేస్తుంది.

'అది బతికుండాలని లేదా? అది అంతే. దాని పుటక అంతే. అది నీకు అక్కర్లేదా' ఈ ప్రశ్నలు ఆమెలో ప్రతిధ్వనించాయి.

ఒకక్షణం ఆ పిల్లను కడుపులో దాచుకుని కాపాడుకోవాలని ఆరాటం. మరోక్షణంలో కోపంతో దాన్ని చావబాదటం...ఈ ఆవేశాల వలయంనుంచీ ఆమెకు విముక్తి లేదు!

'పిల్ల అక్కర్లేదని నేనెందుకనుకుంటాను? అది నా బిడ్డ కాదా? పిల్లలు బాగుండాలని ఆశించడం తల్లిధర్మం కాదా? రాధికను చూచి ఎంత ఆనందిస్తాను! ఇది అలాగే బాగుండాలని కోరుకోవడం తప్పా?

'నా ఆశల్ని, కోరికల్ని ప్రేమిస్తున్నానేగాని—నిజంగా యీ పిల్లల్ని ప్రేమించడం లేదా? ప్రేమించడం, అర్థంచేసుకోవడం, ఒప్పుకోనడం—అన్నీ ఒకటేనా ?

'ఈ బాగోగుల మనస్సు ఎలా ఏర్పడింది?

'ఆలోచనలు, కోరికలు, ఆశలు అన్నీ అబద్ధాలేనా?

సమాధానంలేని ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరైపోయింది జయలక్ష్మి.

## 4

శ్రీనగర్ కాలనీలో మొదటివీధి చివరియింటి పాప మూడేళ్ల పద్మ. ముద్దులు మూటగట్టినట్లుండే పద్మ సంచీ భుజానికి వేళ్లాడేసుకుని, పనిమనిషి కారియర్ తెస్తుంటే ఒక్కోసారి ఏడుస్తూను, ఒక్కోసారి ఏడవకుండానూ స్కూల్ బస్ దగ్గరకు వెళ్లటం జయలక్ష్మి చాలసార్లు చూచింది. పద్మ సరిగ్గా చంద్రిక రంగులో, అంతే ఎత్తుగా, పలుచగా వుంటుంది. అన్నీ సరిగ్గా వుంటే చంద్రిక కూడా యిలానే వెళ్తూ వుండేదికదా అని జయలక్ష్మికి లీలగా అనిపించేది. ఆ అమ్మాయి బస్సుదగ్గరకు వెళ్తుంటే చూడటం జయలక్ష్మికి సంతోషం.

ఆ రోజున పద్మని స్కూలుకు పంపడానికి స్కూల్ డ్రస్ వేశారు. పనిమనిషి కారియర్ పట్టుకుని తయారుగా వుంది. బస్సుకు టైమయింది. పద్మ పెద్దగా ఏడుపు ప్రారంభించింది. వాళ్లమ్మ పద్మనుతిట్టి, రెండు అంటించి పనిమనిషికిచ్చి పంపేసింది తొందర తొందరగా. బస్సులో ఏడుస్తున్నందుకు కండక్టరు కసురుకుంటూనే వున్నాడు. పద్మ ఏడుపు తగ్గలేదు. క్లాసులో టీచరు ఏడుస్తున్నందుకు పద్మని క్లాసుబయట కూర్చోపెట్టేసింది. ఆ బయట గోడ కానుకుని ఒంటరిగా కళార్చుని ఏడ్చి, ఏడ్చి చచ్చిపోయింది పాప. వెర్రిలో చచ్చిపున్నది తేలు...ఈ విషయం విన్నప్పుడు జయలక్ష్మికి కడుపులో వికారం కలిగింది. భయంతో, దుఃఖంతో గుండెలో బరువు. విపరీమైదోకోపం. ఏమిటీ అమానుషం! కుక్క అరిస్తే అరుపులోని అర్థం తెలుస్తుంది. పాప ఏడిస్తే అది బాధవలని ఏడుపో,మామూలు బడి ఏడుపో ఎందుకు కనుక్కోలేకపోయారు? అంత పసిపాప అలా ఏడుస్తూ బడికి పోకపోతేనేం?...మూడో ఏట అమ్మ పాపని బస్సులో వేస్తుంది. బస్సు బళ్లో వేస్తుంది. టీచరు ఏడ్చేవాళ్లని బయటా, ఏడవనివాళ్లని లోపలా వేస్తుంది. క్రమం ప్రకారం యంత్రం తంచనుగా కదిలిపోతూ వుంటుంది. ఆగటానికి వీల్లేదు. అమ్మలూ లేరు, పాపలూలేరు. యంత్రం టుకటుక మాత్రమే వుంటుంది. మనిషి ఒంటరితనంలో ఏడ్చి ఏడ్చి చచ్చిపోతాడు...

అయ్యో, పాపా, అంత ప్రాణాంతకమైన నొప్పిని ఒక్క

దానివే ఎలా భరించావమ్మా. మీ అమ్మ నిన్ను పొదివి పట్టుకొని వీ వొప్పికి నీలో ఏడ్చివుంటే . స్వామీ, ఈ ప్రపంచంలో ఎవరినీ ఒంటరి చెయ్యకు. ఒంటరితనం భయంకరమైనది, భరించరానిది... తలచు కొని తలచుకొని కుమిలిపోతోంది.

"అతిగా ఆలోచించటం ఆరోగ్యకరంకాదు, జయా. ఎందుకు పూరికే లేనిపోనివి ముందువేసుకుని బాధపడతావు ?" అన్నాడు సీతా రామారావు. మనుషుల్ని పట్టి పీడించే యీ భూతాలు లేనిపోనివా ? నేను పనిలేక కూర్చుని బాధపడుతున్నానా ? "ఆలోచన అనేది మనిషి లక్షణం. అది అక్కర్లేనిది జంతువులకూ, వెర్రివాళ్ళకూను" అన్నది విసురుగా. "దాన్లోనూ రెండురకాలున్నై. జరుగుతున్న దాన్ని, జరిగినదాన్ని అర్థంచేసుకునే ఆలోచన ఒకరకం. అది మంచిదే. కాని జీవితాన్ని ఒప్పుకోలేక అనవసరపుటూహలతో బాధను పెంచు కుంటూ పోవటం మంచిదికాదు...మనసువేరూ, శరీరంవేరూకాదు. మనసులో పుట్టే పూహలకి శరీరంమీద ఫలితం వుంటుంది. నవ్వటం నేర్చుకోవాలి, జయా" అయ్యో, జీవితమే దుఃఖసముద్రం అయి వుండగా నవ్వటానికి వీలెక్కడుంది ! ప్రపంచంలోని రంగులన్నీ చూద్దామని, వెన్నెన్నోరుచుల్ని చవిజూద్దామని, గుండెనిండా గాలి పీల్చుకుందామని, ఎగిరే దుమికే ప్రాణిలో ఎగిరి దుముకుతూ నవ్వుదామని చిన్ని శరీరంలో జీవం నింపుకుని ఆనందంగా వచ్చిన పద్మ ఏమయింది !

అనుభవం, ఆనందం—యివి అబద్ధాలు.

ఒంటరితనం, చావు, దుఃఖం—యివే నిజం.

అవాంఛనీయాలు, అనుకోని ప్రమాదాలు—పిచ్చివాని చేతిలోని రాళ్ళలాగా వచ్చి మీదపడుతున్నాయి. వీటిని నియమించే సూత్రం వున్నదా, లేదా ? ఇవి మనిషిని కించపరచి అధీరుణ్ణి చేస్తు న్నాయి. భయపెట్టి నాశనం చేస్తున్నాయి.

తలదాచుకోడానికి ఎన్నో చోట్లుండగా చెడ్డీలోకే తేలు ఎందుకొచ్చింది?అది కొంచెంగా అటుతిరిగి వేరే చోటికి వెళ్లివుండొచ్చు. చెడ్డీ తీసినప్పుడు క్రింద పడిపోయి వుండొచ్చు. అది కుట్టగానే వాళ్ళు గమనించి డాక్టరు దగ్గరకు తీసుకెళ్లి వుండొచ్చు. బ్రతికి వుండటానికి ఎన్ని అవకాశాలు ! కొంచెం అటు యిటు అయితే బ్రతికి పోవచ్చు. అటు యిటు చేసే అవకాశాన్ని ఎలా పట్టుకోవాలి? పిచ్చి వాడి చేతిలోని రాళ్లనుంచి ఎలాతప్పించుకోవాలి ? అసలు యీ అవకాశం అనేది వుందా ? ఉన్నట్టు కనిపిస్తూ, మెరిపిస్తూ, మురి పిస్తూ అనిశ్చితత్వంలో మనిషిని నిలిపి ఆడిస్తున్నది అది !

...మనిషి పరిస్థితులముందు చిన్నవాడు కావచ్చు, అధీరుడు కావచ్చు. భయంతో, దుఃఖంతో నశించవచ్చు. కాని 'మనిషి' గానే నశించవచ్చునే. తన్ను తాను యంత్రంగా మార్చుకోవలసిన దుర్గతి ఎందుకొచ్చింది ?

ఏదో పొరపాటు జరుగుతోంది ! ఎక్కడో ఏదో సంబంధం తప్పిపోతున్నది ! జీవితంలోని ఏదో కృప జారిపోతున్నది !

...ఆవేశమంతా ఆలోచనలుగామారి ఆమెనుండి వేరై చల్ల బడిపోయింది. ఆ దుఃఖానికీ, యీ ఆలోచనలకూ ఏమీ సంబంధం కనబడలేదు...

# 5

సీతారామారావుగారి చిన్నాయన వెంకటప్ప పల్లెనుంచీ వచ్చారు. అతనికి ఎనభై ఏళ్ల వయసు. ఎందుకో, కారణంలేకుండా, ఈమధ్యన మనిషి బాగా కరిగిపోయాడు. జలుబుచేసి తగ్గటంలేదు. ఈమధ్యనే కొద్దిగా వీపులో నొప్పి ప్రారంభమైంది. పరీక్ష చేయించాలని చెల్లెలు సుబ్బమ్మ బలవంతాన వెంటబెట్టుకొచ్చింది. ఎక్స్రే తీశారు. కుడి ఊపిరి తిత్తిలో క్రిందిభాగాన గడ్డ కనిపించింది. బ్రాంకో స్కోప్చేసి చూచారు. 'కాన్సర్' అని ధృవపడింది. ఆ విషయం చెప్పి నప్పుడు ముసలాయన గోడకానుకుని కూర్చుని 'అహాఁ' అని తలూపాడు. విచారంగాని, బాధగాని ఏమీలేదు ఆస్వరంలో. ఈ మనిషికి అసలు సంగతి అర్థమైందా ? అన్న అనుమానం వచ్చింది జయలక్ష్మికి. సుబ్బమ్మత్తా, సీతారామారావూ అతని దగ్గరకూర్చుని ఏమీ ప్రమాదం మీదకు రానట్టుగానే అతనితో ట్రీట్మెంట్ గురించీ, వూళ్లో కబుర్లూ మాట్లాడుతూనే వున్నారు.

ఈ నాలుగురోజుల్లోనే నొప్పి జాస్తి అయింది అతనికి ఆప రేషన్కు తట్టుకోగల శక్తిలేదు. వెంటనే ఏదో ఒకటి చెయ్యాలి ... మర్నాడు రైల్లో హైదరాబాదు కాన్సర్ హాస్పిటల్కు తీసుకువెడతా నన్నాడు సీతారామారావు.

సీతారామారావుకు తండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లి అతని పెళ్లికాకముందుగానే పోయింది. పినతండ్రులు నలుగురూ, మేనత్తలు యిద్దరూ వున్నారు. అందరూ కలిసేవున్నారు. కాలగమనంతో ఆ పల్లెలోని సమిష్టికుటుంబాలన్నీ చిన్న చిన్నవిగా ముక్కలైపోయినా, సోంపల్లెవారి కుటుంబం అలానేవున్నారు. ఇంట్లోని కష్టనష్టా లన్నీ ఆడవాళ్లు సర్దుకోవాల్సిందేగాని, విడిపోవటం అనేది లేదు. పూర్వంనుంచీ కుటుంబంలోవున్న పాతికెకరాల మడిసీ సేద్యం చేసు కుంటారు. పండింది అందరూ తింటారు, ఉంటారు. కాలంతీరి చనిపోయినవాళ్లను వాళ్ల చింతల దొడ్లోనే భూస్థాపితంచేస్తారు ఏడాదికోసారి పోయినవాళ్లకు భోజనం, బట్టలూయిస్తారు. వాళ్ల

తాత అవ్వ, అమ్మ. నాయన, బావిలోపడి చనిపోయిన రెండేళ్ల శీను, పరికిణీ అంటుకుని కాలిపోయిన సునీతి, రెండ్రోజుల జ్వరానికే ప్రాణం విడిచిన పార్వతి, అందరికంటే పెద్దన్న రామయ్య—పోయిన వాళ్లంతా ఒక్కోరూ ఒక్కోరాతి క్రింద వరుసాగ్గా నిలిచి వున్నారు. నిలిచేవున్నారు! అందరూ ఆ పల్లెలో స్థిరంగా వుంటారు ఎల్లకాలానికీను. ప్రాణం పోయినవాళ్లు చింతలదొడ్లోనూ. బతికున్నవాళ్లు వూళ్లోనూ. చావుకీ, బతుక్కీ తేడా అంతే. చావుకూడా బతుకులోని భాగమే.

అవిచ్ఛిన్నంగా యిలా జరిగిపోతున్న ఆ జీవన విధానంలో వెంకటప్ప మొదట్నుంచీ ఆకతాయిగానే పేరు తెచ్చుకున్నాడు. చిన్నప్పట్నుంచీ కూడా సిగరెటు, బీడీలు ఎక్కువగా కాల్చేవాడు వాళ్ళ పద్ధతులన్నిటినీ ప్రశ్నించి, కాదని, ఎగతాళి చేసేవాడు. క్రియదగ్గర మాత్రం నలుగురితోపాటు నారాయణా అంటాడు. అతని ప్రోత్సాహం వల్లనే సీతారామారావు బయటికిపోయి చదువుకున్నాడు. డాక్టరయ్యాడు వాళ్లిద్దరికి చేరిక ఎక్కువ.

'వీళు నన్ను ఆ హైదరాబాదునుంచీ యింటికి తీసుకురారు అక్కడే పారేస్తారు!' ఆ రాత్రి ముసలాయన స్వాధీనంలో లేకుండా ఆ చీకట్లోంచీ నొప్పిలోంచీ దూసుకువచ్చింది ఆవేదన.

'ప్రొద్దున్నుంచీ హైదరాబాదు పోదామంటే సరేనన్నాడు. లోపల ఏముందో చూడు...ఎంతకీ వూరి చుట్టుపక్కల దాటిరారు. వీళ్ళందరూ అంతే!' సీతారామారావు నవ్వాడు.

సుబ్బమ్మత్త తలూపింది. వాళ్ళందరూ అంతే!

'హైదరాబాదు చాలాదూరం. బెంగుళూరు వెళ్దాం. మావూరినుంచీ మనవాళ్ళంతా రావటానికీ, మనం అనుకున్నప్పుడు తిరిగి వూరు చేరటానికీ వీలుగా వుంటుంది' అన్నాడు ముసలాయనతో.

ముసలాయన ముఖంలో తృప్తి కనిపించింది. తరంకాని జబ్బు వచ్చినప్పుడు వాళ్ల వాళ్ళందరూ బెంగుళూరే వెళ్తారు దగ్గరగా వుంటుందని.

సీతారామారావు వెళ్ళి అతన్ని కాన్సర్ హాస్పిటల్లో చేర్పించి డాక్టరుతో మాట్లాడి, సుబ్బమ్మత్త వుండటానికి ఏర్పాటుచేసి వచ్చాడు. కోబాల్ట్ ట్రీట్‌మెంట్ నెలరోజులు పడుతుంది. తర్వాత వూరికి తీసుకెళ్ళొచ్చు.

కాని వారం రోజులకే టెలిగ్రాం వచ్చింది, అతనికి సీరియస్‌గా వుందని.

సీతారామారావు వెళ్తుంటే జయలక్ష్మి కూడా బయల్దేరింది కాన్సర్ హాస్పిటల్ ప్రక్కనే మెదడు, నరాల వ్యాధుల హాస్పిటల్ చాలా పెద్దది వున్నది. అక్కడ చంద్రికను చూపించాలన్నది

కాన్సర్ హాస్పిటల్ పట్నానికో చివర్న పెద్ద మైదానంలో వుంది. ఒక్క బ్లాక్‌మాత్రం కట్టారు. ఇంకో రెండు బ్లాకులు నిర్మాణంలో వున్నై. భవనం పెద్ద గాజు కిటికీలతో, పలకలతో అత్యాధునికంగా, శుభ్రంగా వుంది. అందమైన, ఆరోగ్యకరమైన జీవితానికి పెట్టిన కోటలాగా వుంది గాని మృత్యుదేవత కంచుకోట అని అనుకోవడానికి ఏ మాత్రం వీల్లేదు.

మగవాళ్ళ వార్డు అనబడే గది పొడుగ్గా, విశాలంగా వుంది ముందుగా గోడకానుకొని వరుసాగా మందుల బీరువాలు, ప్రక్కనే పెద్ద స్టూలు మీద ఈశ్వరుడి పటం, ఆ ప్రక్కనే కుర్చీలో డ్యూటీ నర్సు. అక్కణ్ణుంచీ రెండువరసల్లో మంచాలు. మంచాలమీద తెల్లని దుప్పట్లు. కాళ్ళదగ్గర ఎర్రని రగ్గులు. అన్నిమంచాలమీదా అన్ని వయసుల మనుషులూ వున్నారు. కొందరు దగ్గరున్న వాళ్ళతోనో, ప్రక్కనున్నవాళ్ళతోనో మాటాడుతున్నారు. ఇద్దరికి రక్తనాళాల ద్వారా సెలైన్ ఎక్కుతోంది. కొందరికి ముఖాన, కొందరికి గొంతుమీద, కొందరికి ఛాతీమీద, ఒకతనికి కాలుమీద ఊదారంగు సిరా గుర్తులున్నవి - కోబాల్ట్ ట్రీట్‌మెంట్ యివ్వవలసినచోటునుసూచిస్తూ. పేషెంట్లందరూ ఏ పనిలో, ఏ స్థితిలోవున్నా కొత్తమనుషుల రాకపోకల్ని గమనిస్తున్నారు. నిర్వికారమైన ముఖాల్లో ఏ భావమూలేని కళ్ళు అందరి అన్ని కదలికల్నీ అలవాటుగా గమనిస్తూ కదుల్తున్నై.

జయలక్ష్మి పేషంట్లందరి ముఖాల్నీ వరుసాగ్గా పరిశీలించింది. అక్కడ ఏదో చూడాలనీ, తెలుసుకోవాలని తపన. మృత్యు గహ్వరంలో వున్న వాళ్లని ఏదో అడగాలని, ఏవరికి తెలియరానిదీ, వాళ్ళకు మాత్రమే తెలిసేదీ అయిన నిగూఢ విషయాన్ని గ్రహించాలని ఆరాటం.

'మేము చచ్చిపోయేవాళ్లమని మీరు అనుకుంటున్నారుగదా అన్నట్లున్నవి వాళ్ళచూపులు—అందుకే అందర్నీ అట్లా చూస్తున్నారు' అన్నది జయలక్ష్మి సీతారామారావుతో తగ్గుస్వరంలో.

'మనిషన్న ప్రతివాడూ చచ్చిపోయేవాడే... వాళ్లట్లా అనుకోవాలని నీఉద్దేశ్యం' అన్నాడు రావు.

'కాన్సర్ వచ్చాక ఇవాళో, రేపో చావబోతున్నామని నిశ్చయంగా తెలిశాక యింకేమనుకుంటారు ఎవరైనా?' యితనితో యిహ ఎప్పుడూ ఏమీ అనకూడదు అనుకుంటుంది ప్రతిసారీ, కాని అంటూనే వుంటుంది.

వెంకటప్ప చిన్నాన్న పద్నాలుగో నంబరు బెడ్‌మీద కూర్చుని వున్నాడు.

'రాత్రిచాలాగత్తరఅయ్యింది డాక్టర్ నీకు సెలి గాంయిన్మెన్నాడు. పదోనెంబరు వాళ్ళతో చెప్పి యిప్పించాను. రాత్రంతా ముక్కుకి గాలి పెట్టారు. మతిలేదు. మా అమ్మ, అవ్వ, నాయన, పెద్దన్న, అత్త, సునీతి, సుబ్బమ్మ, సీతారావుడు అందరూ వుండేచోటికి నేనూ పోతా అని పలవరింత. ఇహ తీరిపోయిందనే అనుకున్నా. తెల్లారేసరికిచూడు ఎంతబాగా లేచి కూర్చున్నాడో!' అన్నది సుబ్బమ్మత్త.

వెంకటప్ప చిన్నాన్న షెల్ఫ్‌మీది ఉమ్మిగిన్నె చేతిలోకి తీసుకుని మెల్లగా బలహీనంగా దగ్గి దగ్గి పలచటి బంకను దాన్లోకి వూశాడు. 'రాధికమ్మ రాలేదే. ఇంట్లో ఎవరన్నా తోడుగా వుంచారా?' అన్నాడు మెల్లగా, కష్టంగా.

'నీకు బాగాలేదంటే మేము అర్జెంటుగా బయల్దేరి వచ్చాం' అన్నాడు రవు. 'బాగుంది. ఇప్పుడు బాగుంది' అన్నాడు ముసలాయన.

పేషంట్లు అడపాదడపా ఉమ్మిగిన్నెల్లోకి ఆబంక వూస్తూనే వున్నారు. హాస్పిటలు, వార్డులు, మంచాలు, అక్కడుండే మనుషులు, గచ్చు, చుట్టూవుండే మట్టికూడా ఆ వుమ్మిని, ఆ జల్లును పొదుగుకొని అందర్నీ పట్టుకోవాలని పొంచివున్నట్లు తోచింది జయలక్ష్మికి. ఒళ్ళంతా భయంతో, అసహ్యంతో ముడుచుకుపోతోంది. 'ఇక్కడ్నుంచీ తక్షణం పారిపోవాలి' అన్న తొందరపాటు పుడుతున్నది. కాని అక్కణ్ణుంచి కదలనీయకుండా ఏదోశక్తి ఆమెను అంత గట్టిగానూ కట్టిపడవేస్తోంది.

'ఎప్పుడు బయల్దేరారో...ఫ్లాస్కులో కాఫీవున్నె. తాగండి' అన్నది సుబ్బమ్మత్త.

'ఒద్దు...ఒద్దు' అరిచినట్లు కేకపెట్టింది జయలక్ష్మి.

ఆరోజే ఆపరేషన్‌అయి సగం మగతలోవున్న వడివయస్కుడి కూతురు అడుగుతోంది: 'టెంకాయలు మళ్ళీ అయిపోతయ్యేమో, డబ్బులియ్యి తెస్తాను' అని. అతను ఎంతో ప్రయాసతో జేబులో చెయ్యిపెట్టి తడుముకుని నోట్లకట్టలోనుంచి అయిదురూపాయల నోటుతీసి ఆమె చేతికిచ్చాడు.

గట్టిగా, దిట్టంగావున్న దవడ కాన్సర్ పేషంటు వివరినో బయటి వరండాలోనికి పిల్చుకుపోయి తగ్గుస్వరంలో వ్యవహారవిషయాలు చర్చిస్తున్నాడు.

కాలి ఎముక కాన్సర్ ముసలాయన పెండ్లాము పెద్దకుంకుమ బొట్టు పెట్టుకున్న పండు ముత్తైదువ ఈశ్వరుని పటానికి పూలదండవేసి, పూజచేసి అరటిపండ్లు నివేదన పెట్టింది. వార్డుకొచ్చిన దగ్గర్నుంచీ రోజూ యిలానే చేస్తున్నది. ఇవాళ ముసలాయన్ని డిశ్చార్జి చేసి యింటికి పంపుతున్నారు. అతనికి యిప్పట్లో వాళ్ళుచేయగలిగిన ట్రీట్‌మెంట్ అయిపోయింది. అతన్ని బయటికి తీసుకెళ్ళడానికి మనుష్యులు స్ట్రెచర్ తెచ్చారు. ఆమె అరటిపండ్లు ఒలిచి చిన్న ముక్కలుగాతుంచి వార్డులో అందరికి ప్రసాదం పంచింది. నవ్వు మొగాలతో అందరూ భక్తిగా కళ్ళకద్దుకొని నోట్లో వేసుకున్నారు. జయలక్ష్మికి ఆమె అందరికీ కాన్సరు ముక్కలు పంచుతున్నట్లనిపించింది. యిచ్చిన ముక్కను చేతిలో పట్టుకుని ఏం చెయ్యాలో తెలీక చూస్తూ నిల్చుంది. తనకిచ్చిన ముక్కను తినేసిన చంద్రిక ఆమె చేతిలోనిది కూడా లాక్కుని మింగేసింది. 'ఛ, పాడుపిల్ల' అంటూ గట్టిగా మొట్టికాయ వేసింది జయలక్ష్మి.

అవతల మంచంలో బట్టల్లో మనిషివున్న వైనంకూడా తెలీకుండా మంచాని కంటుకుపోయిన ముసలాయనకు, ముక్కులోంచి ప్లాస్టిక్ ట్యూబ్ వేళ్ళాడుతున్నది. అతని దగ్గరున్న యువకుడు ఒక గ్లాసులో మందులు, పచ్చికోడిగుడ్డు, నలిపిన బ్రెడ్‌ముక్కలు, అరటిపండువేసి అన్నీ కలిపి గిలకొట్టాడు. ముక్కులోని ట్యూబు చివర్న గరాటు తగిలించి అందులోకి పోశాడు. నోటి అవసరం, రుచి, వాసన, అనుభవం ఏమీ అక్కర్లేకుండానే ఆహారం ముసలాయన కడుపులోకి పోయింది! జయలక్ష్మికి కడుపులో దేవినట్లయింది. ఈ మనిషి చావకుండా యింకా ఎందుకు బతికున్నాడు? ఏమిటీ ప్రాకులాట! పనికిమాలిన శరీరాల్తో, చావు నిశ్చయమని తెలిశాక కూడా జీవితాన్ని ఒదల్లేక మంచాల్లోపడివున్నవాళ్ళ ఉదాసీనపు చూపుల్లోని అర్థంకానిదేదో ఆమెను చుట్టుముట్టింది.

'ఇంక పోదాం పదండి' అన్నది.

వెంకటప్ప చిన్నాన్న నిశ్చలత్వం లోంచి మెల్లగా కళ్ళు పైకెత్తాడు. సుబ్బమ్మత్త పాలగ్లాసు యిచ్చింది. లవిత్రాగి, గ్లాసు ఆమె చేతికిచ్చి, మెల్లగా వెనక్కి వాలిపోయాడు. నర్సు ప్రక్కనే వున్న ఆక్సిజన్ తెచ్చి పెట్టింది. వార్డ్‌బోయ్‌వెళ్ళి డాక్టర్ని పిల్చుకొచ్చాడు. అతని ప్రాణం ఎప్పుడో వెళ్ళిపోయింది!

## 6

కాన్సర్ హాస్పిటల్‌కు వెళ్ళి వచ్చినప్పటినుంచీ జయలక్ష్మికి తన శరీరం భయంకరంగా కన్పిస్తోంది. అక్కడ తనుచూచిన కాన్సర్లన్నీ యిక్కడా వుండవచ్చునన్న భ్రమ కలుగుతోంది. ఎక్కడ చూచినా చిన్న వాపువున్నదేమోనన్న అనుమానం. లివర్‌లో ఓప్రక్క కొద్దిగా గట్టిగాలేదా? మొన్న కాలి ఎముకకు చిన్నదెబ్బ తగిలింది ఇన్నాళ్ళు మానలేదే! ఈ పులిపిరిలాంటిది స్కిన్ కాన్సర్ కాదుగద!

ఏమిటీ కఫం పలచగా, చిక్కనగా వస్తోందే! ఏమిటిది యిలా వెంటాడు తోంది నన్ను ?

ఒకచోటపుట్టి హేలగా యితర భాగాలమీదికి విగురుతూ, ఆడుకుంటూ, అక్కడ పాదుకుంటూ తిరిగే వెర్రి మృత్యువు కాన్సర్. ఒకచోట ఆపితే యింకోచోట పెరుగుతుంది—ఊరుగాయలో బూజు పెరిగినట్లు.

మలబద్ధకం కొత్తగా వచ్చిందా ? పెద్దపేగులో కాన్సర్ వుండొచ్చు. కడుపు నుగ్గులాంటిది వుందా ? అదీ కాన్సరేకావచ్చు. చర్మం రంగు మారిందా ? పులిపిరి వచ్చిందా ? వాపుగాని, నొప్పిగాని వున్నదా? జలుబు తగ్గలేదా? ఆకలి చచ్చిందా? అన్నం సయించటం లేదా ? మెడమీద వాపు వచ్చిందా ? క్రింది దవడ మొదట్లో వుబ్బిందా ? పళ్ళల్లోంచి రక్తం పడుతున్నదా ? ఎక్కడైనా కాయ గాని, గడ్డగాని ఏర్పడిందా ? కాలుగాని, చెయ్యిగాని నొప్పివచ్చిందా? యివన్నీ కాన్సర్లు కావచ్చు. ఏం జబ్బూలేదా ? క్రిందటి అయిదా రేళ్ళలో జ్వరంకూడా రాలేదా ? !అదీ కాన్సర్ సూచనే ! తొందరగా కనిపెట్టండి... చావు తప్పించుకోండి ! ఎక్కడుందా కాన్సర్ ? ఇవాళ నీవు కనిపెట్టడానికీ, ఉపేక్షించడానికీ మధ్యన బ్రతుక్కీ, చావుకీ మధ్యన వుండేంతదూరం వుంది ! త్వరపడు. కనిపెట్టు. బ్రతుకు ! తెలుసుకో.

ఇలాంటి అనుమానం వచ్చిన ప్రతిసారీ జయలక్ష్మికి భయంతో మతిపోతుంది. ఆమె గుండె ధన్, ధన్‌మంటూ కొట్టుకునే చప్పుడు ఆమెకే వినిపిస్తుంది. శరీరం స్తబ్దమై, చెమటలు కారిపోతుంది. భయం దయ్యంలాగా పట్టేస్తుంది. ఆమెచేసే పనులు, మాటలు ఏవీ తనని కానట్లు, ఎవరో చేస్తున్నట్లు అనిపిస్తుంది...తన అను మానం నిరాధారమైనదనీ, తనకు కాన్సర్ లేదనీ, చావు ముంచుకు రాలేదనీ అనుకోగలిగినప్పుడే మళ్లీ తాను తానై, ఒకటై, ఆనందం వెల్లువలాగా ముంచుకొస్తుంది...

'నేను అప్రమత్తతతో వుంటున్నంతవరకూ నాదగ్గరకు ఏ ప్రమాదమూరాదు...ఈ తెలుసుకుంటున్న తెలివే నాకు రక్ష, సత్యం. ఈ తెలివి లేకుంటే యిహ నేను అనేది ఏముంటుంది ? ఈ తెలివే నేను, నిజం' అనిపిస్తుందామెకు.

“నీకు బ్రతుకే ఒక కాన్సర్‌లాగా కనిపిస్తోంది. అలా భయ పడుతూంటే బ్రతికేదెలాగ ?... పుట్టినప్పటినుండి శరీరం నిర్ణీత మైన దోవలో నడుస్తూ, పెరుగుతూ నశింపుకు సిద్ధమౌతుంటుంది. కాని అదంతా మనకు కనిపించదు. జీవమూ, మృత్యువూ రెండూ ఎప్పుడూ యిక్కడ జంటగానే వుంటూవుంటవి. పుట్టిన ప్రతి మనిషీ చచ్చిపోతాడు ఎప్పుడో ఒకప్పుడు. శరీరమ్మూ, మనస్సూకూడా కొన్ని పరిమితులకు లోబడే ప్రవర్తిస్తాయి. ఒక పరిధిని దాటిపోలేవు. ఆ పరిమితుల్ని మనం ఒప్పుకోకపోతే మనకే బాధ...'' సీతారామా రావు మందలించాడు.

“ఓహో!... ఇదంతా మీ సోంపల్లె వారి కుటుంబవేదాంతం కాబోలు ! ఇదే మా పరిధి అనుకునేవాళ్ళకి పెరుగుదల ఎలా వుంటుంది ? శాస్త్ర విజ్ఞానం ఉరుకులు పరుగులతో ముందుకు సాగుతున్నది. అమ్మవార్లు అని దణ్ణంపెట్టిన జబ్బులకి, వాక్సిన్లు కనిపెట్టారు. శివుడి తల్లోవున్నాడనే చందమామ మీదికి ఎక్కి కూర్చున్నారు. సర్వజగదాధారభూతుడు, ఆత్మకారకుడు, గాయత్రీ మంత్రానికి అధిష్ఠానదేవత అయిన సూర్యుడి దగ్గరకు చేరుకుంటు న్నారు. ఇంకా మీలాంటివాళ్లు పరిధుల్ని గురించి మాట్లాడు తున్నారు!...ఈపరిధుల్నీ,పరిమితుల్నీ నేనుఒప్పుకోను!...ఒప్పుకోను!!'' అంటూనే గుండె పట్టుకుని 'అమ్మా' అంటూ కూలబడి పోయింది.

హాస్పిటల్లో కార్డియాలజిస్ట్ పరీక్షిస్తుండగానే రెండోసారి నొప్పి వచ్చింది. ఇ. సి. జి. తీసి చూశారు. 'గుండె బాగా దెబ్బ తిన్నది. మళ్ళీ నొప్పివచ్చినప్పుడు ఏం జరుగుతుందో చెప్పలేము. జాగ్రత్తగా వుండాలి' అని ఇంగ్లీషులో అతను భర్తకు చెప్పడం విన్నది.

ఆమె మనస్సు ఆలోచిస్తోంది... నేను గుండెనొప్పితో చచ్చి పోతాను. కాన్సర్‌తోకాదు...చావు దగ్గర కొచ్చింది. రేపో, నెలకో, సంవత్సరానికో, ఎప్పుడో దగ్గరకు వచ్చేసింది... నవ్వు—పెద్ద, అర్థం లేని నవ్వు. ఏడుపు—సర్వం పోగొట్టుకున్న మహాభారాన్ని గుండెల్లో పాదుపుకున్న ఏడుపు. రెండూ ఒక్కసారిగా ముంచుకొచ్చాయి.

ఇంతవరకు నేను సరిగ్గా కళ్ళైనా తెరవలేదే! అప్పుడే చచ్చిపోతానా ? ! మనసు భయభ్రాంతిలో మూగగా ఏడుస్తోంది. చూపు మేరంతా అంధకారం. అంధకారంలో దేనికోసమో పరి భ్రమణం. ఏదిక్కునైనా తప్పించుకోడానికి దోవవుందేమోనని మనసు వెర్రెత్తినట్టు పరుగులిడుతోంది.

పైకిమాత్రం ఆమె మామూలుగానే యింటికొచ్చింది. రాధిక కాలేజీలో తనకు డిబేట్‌లోనూ, ఎలక్యూషన్‌లోనూ ఫస్ట్‌ప్రైజ్ వచ్చిన ఆనందంతోవుంది. ఆ విషయాలు వింటూంటే జయలక్ష్మి కేమీ ఉత్సాహం కలుగలేదు. అవన్నీ తనకు సంబంధించని విషయా ల్లాగా వినపడ్డవి. అన్నీ చెప్పాక రాధిక అడిగింది : డాక్టరు ఏం చెప్పారు ?' అని. 'గుండె కొంచెం దెబ్బతిన్నది. జాగ్రత్తగా వుండా లన్నారు' అన్నది. ఆమాటలు ఆమె నోట్లోంచి బయల్దేరి బయటి ప్రపంచంతో సంబంధం ఏర్పరచుకుంటున్నా, ఆమెతో ఏమీ సంబంధం లేని విషయంలాగా క్రొత్తగా అనిపించాయి. చంద్రిక ఏదో అర్థ

మైనదానిలాగా దగ్గరకొచ్చి ఆమె వేరకుచ్చెళ్ళు చుట్టూ తిప్పుకుంటూ 'అమ్మా' అన్నది. మొదటిసారిగా చంద్రికమీద ఏమాత్రం కోపం లేని, సానుభూతి కలిగింది,

తాను నిజంగా చచ్చిపోతున్నానని ఆమెకు నమ్మకం కలగటం లేదు. నేను యింతవరకు ఏమీ అనుభవించలేదే, తెలుసుకోలేదే, జీవించలేదే! నేను చచ్చిపోవటం ఏమిటి ? ! అసంభవం! నేను చావను! ఇన్నాళ్ళ నేను గడిపిన జీవితం ఏది? నా అనుభవాలేవి? నా భవిష్యత్తు ఏది? ఏమీ కనబడటం లేదు. 'నేను ఏది? ఎక్కడున్నాను? అదిగో, ఆ కనిపించేవాళ్ళంతా నవ్వుతున్నారు, ఏడుస్తున్నారు, పరుగెత్తుతున్నారు, తింటున్నారు, ఆనందిస్తున్నారు; అనుభవిస్తున్నారు. నా అనుభవాలేవి? 'నేను' ఏది?

మనసునిండా కసి, ఆశ్చర్యం. నేను లేకున్నా వీళ్ళందరూ యిలాగే బతికుండి, భోంచేసి, తిరుగుతూ, నవ్వుతూ వుంటారా! ఈ ప్రపంచం యిలాగే వుంటుందా? ఈ చెట్లు యిలాగే పచ్చగా వుంటాయా? ఇండ్లూ, వూరూ, భూమీ, ఆకాశం... ఈ ఆకాశం యింత స్వచ్ఛంగా, నీలంగా, అనంతంగావుంటే, దాన్ని చూస్తూ యీ క్రింద నేనుండనా?!...నాకంటేముసలివాళ్ళు, అప్రయోజకులు, రోగిష్ఠులు, మూర్ఖులు—ఇందరూ వుంటూంటే నేను మాత్రం వుండకుండాపోవాలా? ఎంత అన్యాయం! నేను లేకుంటే యిదంతా ఎందుకు? అంతా నశించిపోవాలి! నశించిపోతుంది;...

ఒక ముసలావె వంటకు కుదిరింది. మంచి మనిషి. చంద్రికకు అన్నం పెట్టడం దగ్గర్నుంచీ అన్ని పనులూ ఆమే సమర్థించుకుంటోంది. ఇప్పుడు జయలక్ష్మికి పనేమీలేదు. మంచంలో పడుకుని పనులన్నీ జరిగిపోవటం చూస్తోంది. తానుగా కల్పించుకొని పురమాయించడం కూడా లేదు. 'నేను అప్పుడే యీ యింట్లోంచిమాయమై పోతున్నాను. వీళ్ళందరూ నేను లేకుండా పోయేస్థితికి అలవాటు పడి పోతున్నారు; అప్పుడే' అనుకుంది.

"నా బతుకు పరిమితమైపోయిందికదా..." అన్నది దిగులుగా భర్తతో.

"బతుకనేది మనుషులందరికీ పరిమితమే...ఎవరు ఎన్నాళ్ళుంటారో ఎవరూ చెప్పలేరు...నీకంటే ముందే నేను పోవచ్చు..." ఆమెను ఓదార్చాలనే అన్నాడతను.

"ప్రతిమాటకీ వంకర అర్థాలు తీస్తారు...మీరందరూ నాలాగా ప్రతిదినమూ యిదే ఆఖరిదేమో ననుకుంటూ వుంటారా?"

అతను నవ్వాడు. "అనుకోను. నిజమే. కాని అనుకున్నప్పుడూ బాధపడను" అన్నాడు.

'ఈ ఓదార్పు మాటలకేమిలే' అనుకుందామె.

'నిజంగా నేనేచేయవలసిన పని అనేదిలేదు! ఇన్నేళ్ళు నేను ఎందుకు తాపత్రయపడ్డాను? నేను సాధించిందేమిటి? అసలు ఈ నేను ఎవరు?' ఈ ప్రశ్నలు ఆమెను కలతపెడుతున్నాయి. వాటికి సమాధానం దొరకందే ఆమెకు శాంతిలేదు.

'నేను అంటే యీ కనిపించే శరీరం—

కాని నా రక్తం పారుదల నాకు తెలియదు. నా శరీరం పెరుగుదల నాకు తెలియదు. నరాలద్వారా తెలిసే కొంత విషయం తప్ప నిజానికి ఈ శరీరం నాకు తెలియదు. కొంత అదుపువున్నా, అది నా ఆజ్ఞకు లోబడి వుండలేదు. అది నేను ఎలా అవుతాను!

నేను అంటే నా మనసు—

కాని నాకు అనేకమైన ఆలోచనలు నిరంతరం తోస్తూనే వుంటాయి. ఎప్పుడు, ఎందుకు, ఎక్కణ్ణుంచి వస్తున్నవో తెలియదు. అవి తోచేకనే నావి అంటున్నాను. అవి 'నావి' ఎలాగౌతాయి?

నా అనుభవాలు...

మరుపు తెరల్లోకి జారి మాయమైపోతున్నాయి.

మిగిలినవాటిని మిగుల్చుకుంటున్న 'యిష్టం' నేనా? అదీ నా చేతిలో లేదే! అనుకుంది.

నేను అంటే ఏమిటో తెలియకపోయినా బతుకు చాలా విలువైనదిగా తోచింది. 'వెధవబతుకు! పుత్తడోర్! ఇందులో ఏముంది!' అంటూ జీవితంలోని ప్రతి క్షణాన్నీ విషపూరితం చేస్తూ వచ్చిన ప్రశ్న యిప్పుడులేదు...చావును చూచినప్పుడే బతుకు విలువ తెలుస్తుంది!

కాని యిప్పుడు—ఈ చివర్లో—అది తెలిసి ప్రయోజనమేముంది?

జీవితం చెయ్యిజారిన చేదతాడులాగా పట్టులేకుండా జారిపోతున్నది.

ఇంత జీవితం,ఇన్ని సంవత్సరాలు—ఇంతకాలం!— ఎట్లా గడిపేశాను?! ఎంత నిర్లక్ష్యంగా గడిపాను! ఇంతకాలంలో ఏం చేశాను? ఏం తెలుసుకున్నాను? ఏదో మహాశక్తి నా ముందు ప్రత్యక్షమై 'జయా, ఇదిగో నీ జీవితం...తిరిగి జీవించు' అంటే...ఎంత తెలివితో, ప్రతిక్షణాన్ని ఎంత అపురూపంగా బతుకుతుంది! అప్పుడు... అప్పుడు...

అప్పుడు ఏం చేస్తుందో. తన జీవితాన్ని ఏ క్షణం దగ్గర మార్చి మలుపు తిప్పుకుంటుందో జయలక్ష్మికి తోచలేదు. ఆలోచించిన కొద్దీ మళ్ళీ జీవించినా తాను అట్లాగే జీవించాల్సి వస్తుందనే తోచింది.

ఒకవేళ రాధిక పుట్టాక యిహ పిల్లలే వద్దని అనుకుని వుంటే అప్పటి ఆనందం అలానే నిలిచివుండునా ? ఎంతో వేదన, ఆలోచన తప్పేది అనుకుంది. కాని రాధిక పుట్టినప్పుడు ఆపిల్ల చురుకుదనం, త్వరగా మాటలొచ్చాయనీ, తోటివారికంటేముందు నడిచిందనీ, దాని కళ్ళు పెద్దవనీ, అది ముద్దుగా వుందనీ తెలివిగల దనీ - ఎన్నోవిధాల పొందిన సంతోషం పునరావృతం కావాలని, యింకో బిడ్డ—కొడుకు—కావాలని కోరికతో తపించిపోగా—దాని పర్యవసానంగా ఏర్పడిన చంద్రిక—ప్రతిక్షణమూ అంతకుముందు గడచిన కాలానికి, ఏర్పడిన మనస్థితికీ వారసత్వం వహించి అనుల్లంఘ్యం అయి కన్పించింది. ఎన్నిమార్లు అవకాశం వచ్చినా యీ మనసు యిలాగే ప్రవహిస్తుంది !

కాని.. ఈ శరీరంలోవున్న ఎన్నో కణాలో నుంచీ, ఎన్నో అవకాశాల్లో నుంచీ రాధిక, రాధికను మించినవారు, కొడుకు, మహాజ్ఞాని, శాస్త్రవేత్త, పండితుడు—ఎవరైనా ఏర్పడటానికి అవకాశంవున్నప్పుడు, యీ చిట్టిపిచ్చి చంద్రిక ఏర్పడటానికి కారణం ఏమిటి ? ఇదికూడా పిచ్చివాడి చేతి రాయిలాగా తగలటమేనా ? అంతకు మించిన అర్థం వున్నదా ? మనసులోని ఆలోచనలకూ, బయట ఏర్పడుతున్న సృష్టికీ మధ్యన సంబంధం ఎక్కడో తప్పిపోతున్నది !

తన మనస్సును పరిశీలించినకొద్దీ ఆమెకది విపరీతమైనదిగా, వికృతమైనదిగా కన్పించసాగింది. జ్ఞాపకాలూ, కోరికలూ అనేవాటిని కలబోసుకుని ఏర్పడి; విలువల కొలబద్దను ఆధారంగా పెట్టుకుని; కోరికలను ఆరాధిస్తూ కన్పించేదాన్ని తిరస్కరిస్తూ; ఆదర్శాల ఔన్నత్యాలు; అధఃపతనాల హైన్యాలు, హెచ్చు తగ్గులు అంటూ ఒక కృత్రిమపు విలువల అవాస్తవిక లోకాన్ని సృష్టించుకుని సహజత్వాన్నీ వాస్తవికతనూ నిరాకరించే మహమ్మారిలాగా కన్పించింది. దాని యిష్టప్రకారం జరిగితే చంద్రిక వుండదు, రాధికావుండదు — గొప్పదనానికి హద్దు ఎక్కడుంది ? సీతారామారావూ వుండడు, జయలక్ష్మి వుండదు! ఈ మనస్సుకు, యీ ఎక్కువ తక్కువల విలువల లోకానికి మూలతత్వం వినాశం. వాస్తవికతను నిరాకరించి, అవాస్తవిక లోకాల్ని సృష్టించడం, కన్పించేదాన్ని నాశనం చెయ్యడం !

అయితే ఆమెనూ, ఆమెలోకాన్నీ రక్షిస్తున్నది ఏమిటి ? ఆ రక్షణ, ఆ ప్రేమభావం యీ మన స్థాయికి సంబంధించిందికాదు. కార్యకారణ సంబంధాన్ని అధిగమించిన మరోస్థాయినుండి వస్తున్న కృపావర్షం అది!

నాది అనుకుంటున్న యీ మనస్సుకీ, నేను అనుకుంటున్న ఈ మనిషికీ ఏమీ శక్తిలేదు ! మనిషి ఆలోచనలతో, కోరికలతో నిమిత్తంలేకుండా స్థితులు ఏర్పడుతున్నాయి. ఏర్పడ్డాకనే అవి మనిషిలోని భాగాలవుతున్నాయి. 'నా'వి అనేవన్నీ ఎందుకు, ఎక్కణ్ణుంచి వస్తున్నాయో మనిషి చెప్పలేడు...మనిషికి యిష్టడు అందని ఏదో ఒక స్థితిలో అవి 'నా'వి అవుతాయా? అవకుంటే మనిషి జీవితం నిరర్థకం. గాలికి కొట్టుకు వచ్చిన మేఘాలు ఆకాశంలో ఒకచోట ఒక ఆకారంగా ఏర్పడతాయి. అదొక నిశ్చితమైన ఆకారమనీ, దానికేదో అర్థం వుందనీ భ్రమ కలుగుతుంది. మరో గాలితో అవి చెదిరిపోతాయి. మనిషి కూడా యింతేనా ? !

మనిషి దానిని ఎలా సహించగలడు! దేన్ని నమ్మి ముందుకు వెళ్ళగలడు? తాతయ్య దేవుణ్ణినమ్మి సులువుగా తెలియనిదాన్లోకి వెళ్ళిపోయాడు. వెంకటప్ప చిన్నాన్న వంశాన్నీ, రక్తాన్నీ నమ్ముకుని, పుట్టినవాళ్ళకు చావుతప్పదన్న స్పృహతో మరో ఆలోచన లేకుండా దాన్లోకే వెళ్ళిపోయాడు. 'నేను దేన్నీ నమ్మగల శక్తిలేనిదాన్ని. నేను ఎలా వెళ్ళేది? ఈ పెంజీకటిలో నాకు రక్షణ, మార్గము ఏవి?' అనుకుంది జయలక్ష్మి.

ఆలోచనలతో ఆమె మనసు అలసిపోయింది. స్తబ్దమైపోయింది...ఎప్పుడో జరిగిన విషయం గుర్తొచ్చింది. పూజ గదిలో దేవుడి పీఠంముందు పడివున్నది పెద్దబల్లి. ఆమెకు బల్లి అంటే చెప్పరాని భయం, పట్టరాని అసహ్యం. దాన్ని అక్కణ్ణుంచీ తరిమెయ్యాలని నేలమీద చప్పుడు చేసింది. అది పోలేదు. ఒక పొడుగాటి పుల్లతెచ్చి దాన్ని కదిలించింది. అది నేలను గట్టిగా కరిచి పట్టుకుంది. ఏమాత్రం కదల్లేదు. మెల్లిగా కళ్ళెత్తిచూచి, మళ్ళీ మూసుకుని, తోకను మెల్లిగా కదిలీ కదలనట్లు కదిలించింది. దాని చూపులోభయం లేదు. ప్రాధేయపడటం లేదు. 'నాపాటికి నన్ను చావనీ, కదిలించకు,' అన్నదే ఆ బల్లి వుద్దేశ్యమని ఆమెకు నిశ్చయంగా తెలిసింది. దాని ప్రక్కనే నేలమీద నాలుగు అన్నం మెతుకులు వేసి కొంచెం నీళ్ళుపోసి, వెళ్ళిపోయింది. ఆ క్షణంలో ఆ బల్లి అంటే ఆమెకు భయం వెయ్యలేదు, అసహ్యమూ కలగలేదు !

రోడ్డులో మేళం వెళ్తోంది. జయలక్ష్మిలేచి యింటి వెనక్కు వెళ్ళింది. మేళం కూడా యింటి వెనక్కు వచ్చి దిగింది: ముందే త్రవ్వి పెట్టుకున్న గుంటదగ్గరకు చేరారు జనం. మనిషిని గుంటలో పడుకోపెట్టి మట్టి కప్పేశారు...అయిపోయింది...జయలక్ష్మి దేవుడి గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంది దేవుడిముందు సాష్టాంగపడి, కన్నీళ్ళతో 'స్వామీ, నన్ను బ్రతకనీ! నన్ను బ్రతికే వుండనీ!' అన్నది...మళ్ళీ మళ్ళీ అన్నది...పిచ్చిగా అన్నది ..అంటూనే వుంది...

## 7

అకస్మాత్తుగా ఆమె ఆలోచనలు స్తంభించిపోయినై. సంతోషం, దుఃఖం, బాధ, బరువు, ఆలోచన—ఏమీ అంటని, దేని

తోనూ సంబంధంలేని నిశ్శబ్దం ఏర్పడింది. తను వేరై, పైకి లేచింది అన్నీ 'తన'కు కనబడుతున్నై. అర్థం అవుతున్నై. విశ్వమంతా ఒక గొప్ప యంత్రంలాగా కదిలిపోతున్నది. గాలి, నీళ్ళు, వెల్తురు, భూమి, చెట్లు, జంతువులు, మనుష్యులు, ఏడ్పులు, నవ్వులు—అన్నీ కాలంలో నడుస్తూ, తిరుగుతూ, పరుగెత్తుతూ, వున్నాయి. అవి నడవ్వలసినట్లు నడుస్తున్నవి; చేయవలసినట్లు చేస్తున్నవి; దేని సహజ ధర్మాన్ని అది నెరవేర్చుకుంటున్నది. అక్కడ ప్రశ్నలులేవు; సమాధానాలులేవు. అక్కడ నిండుగా ఎన్నో జీవాలు కదలాడుతున్నై. ఒకే జీవం వెల్లివిరుస్తున్నది! అక్కడ నిండుగా ఎన్నో ఆనందాలు నర్తిస్తున్నై. ఒకే ఆనందం పొర్లిపోతున్నది. ఒకటే అన్నీ, అన్నీ ఒకటే. బ్రతుకు దాన్నుంచీనే పుడుతున్నది. చావు దాన్నుంచీనే పుడుతున్నది. రెండూ ఒకటే. ఏం జరిగినా ఫరవాలేదు!

ఆమెకు చంద్రిక కనపడ్డది ఆడుతూ, నవ్వుతూ. రాధిక నవ్వుతూ పరుగెడుతున్నది. సీతారామారావు తాపీగా నడుస్తూ కనపడ్డారు. జయలక్ష్మి కూడా కనబడ్డది—తలవంచుకుని ఏడుస్తూ. 'ఫరవాలేదు. ఏమి జరిగినా ఫరవాలేదు. అన్నీ ఒకటే' అన్నది జయలక్ష్మితో.

జయలక్ష్మి లేచింది. ఎన్నో జీవాలు, ఎన్నో ఆనందాలు ఆమెలో నిండి, ఆమెను సఫలీకృతురాల్ని చేస్తున్నట్లు సంతృప్తి, ఆనందం. నిండా నవ్వు. పెద్ద నవ్వు.

ఈ ఆనందంనుంచీనే, యీ నవ్వునుంచీనే ప్రపంచం పుడుతున్నది. అందువలననే ఇంత దుఃఖం, అర్థంలేనితనం, బాధ, బరువు ఇను సునాయాసంగా భరిస్తున్నది. ఈ నిమిషంలో యింత తేటతెల్లంగా, స్పష్టంగా కన్పిస్తున్న,తెలుస్తున్న విషయం—యిదే జీవ రహస్యం ! ఇప్పుడు నేను ఎన్ని జన్మలైనా ఎత్తగలను. అవలీలగా ఎన్ని చావులైనా చావగలను. ఈ జీవితం ఒక ఆట. ఈ ఆటను ఆడించేదీ, ఆడేదీ ఆటా కూడా నేనే !

మనిషికుండే పరిమితులు, జీవితానికి అర్థం, స్వేచ్ఛ—అన్నీ ద్వంద్వ స్వరూపమైన మనసుకు సంబంధించిన ప్రశ్నలు. అనవసరమైన ఆలోచనలు. కాలంకూడా మనసుకు సంబంధించిందే గాని సత్యం కాదు. మనిషికి ఈ క్షణం అనేది సత్యం; కాలం అనేది ఊహ. కాలం లేదు; అనేకమైన క్షణాలు వున్నాయి. ఒక క్షణానికీ మరో క్షణానికీ మధ్యన సంబంధంలేదు. ఆ సంబంధాన్ని కల్పించేది మనస్సే.

...ఇవన్నీ ఆ క్షణంలో ఆమెకు తెలిసినై.

ఆ రోజంతా ఆమె నిశ్చలమైన మనస్సుతో, స్తంభించిన కాలంలో, ఆనందంలో వుండిపోయింది. మామూలు స్థితికి రావడానికి రెండు రోజులు పట్టింది.

క్రమంగా ఆ మహత్తరమైన అనుభూతి స్పష్టతను కోల్పోయింది. ఎంత ప్రయత్నించినా మళ్ళీ దాన్ని అందుకోవటం సాధ్యం కాలేదు. అది మనసులోకి జారి ఊహగా, సిద్ధాంతంగా, మాటలుగా మారిపోయింది. పేలవమూ, అర్థశూన్యమూ అయిపోయింది.

కాని అటువంటిస్థితి ఉన్నదన్న జ్ఞాపకంమాత్రం మిగిలింది.

'ఈ జ్ఞాపకాన్ని నిలుపుకోవటమే తపస్సు. ఈ స్పృహను సజీవం చేసుకోవడమే విముక్తి' అనుకుంది జయలక్ష్మి. 'ప్రతి చిన్న విషయంలోనూ అర్థాన్నీ, ప్రయోజనాన్నీ చూడటానికి అలవాటుపడ్డ మనస్సు-అర్థమూ ప్రయోజనమూలేని స్థితిని ఎప్పటికైనా గ్రహించగలదా? నేను నేను, అంటున్న అరాకొరా తెలివి అణగిపోవటం జరుగుతుందా!' అని అనుకుంది.

ఇంటి వెనుక స్మశానాన్ని చూస్తే ఆమెకు జుగుప్స కలగలేదు. మట్టిపెళ్లాలూ, తుప్పలూ, బూడిదకుప్పలూ, సన్నని నీరూ—అంతా సూర్యకాంతిలో మామూలుగా వున్నది. వూళ్ళో వీచేగాలి యిక్కడా వీస్తున్నది. వూళ్ళో ప్రకాశించే సూర్యుడే యిక్కడా ప్రకాశిస్తున్నాడు...చావు సహజమైనదీ, పుట్టుకవలెనే అవసరమైనదీగా తోచింది. మనుష్యులు ఒకేమాదిరిగా పుట్టినందువలన ఒక జాతి కావటంలేదు. పుట్టిన వారందరికి 'చావు సత్యం కనుక ఒకేజాతి అవుతున్నారు. పుట్టుక వేర్పాటుకు నాంది అవుతున్నది. చావు ఐక్యతకు చిహ్నం అవుతున్నది. జీవితంలోవుండే సత్యం 'మార్పు'. ఆ మార్పు యొక్క పరాకాష్ఠ చావు! అవసరాలు, బాధ, దుఃఖం, చావు—యివే యీ మనుష్యులందరి మధ్యనావుండే సంబంధాన్ని సూచించేవి. వాటిని జయించాలనేదే మానవుని నిరంతర ప్రయత్నం. కాని, ఆ విజయం లభించటంతోనే మనిషి నశించిపోతాడు! ప్రపంచస్థితి ద్వంద్వాల మీదనే నిలచివున్నది. ఆ నిరంతర ద్వంద్వాలలో ఒకటేవుండి రెండోది లేకపోవటం వుండదు. ఈ మనసు దేన్ని కోరుకుంటోందో, దేన్ని కరుణ అంటోందో అది చావు. ద్వంద్వాల్ని నిరాకరించినప్పుడు జీవం, సత్యం అక్కడుండవు!...కాని కాలానికీ, కార్యకారణ సంబంధానికీ లోబడివుండే మనస్సు దాన్ని గ్రహించలేదు!

'ఈ క్లిష్టతను, ఈ సంకీర్ణతను, ఈ వైవిధ్యాన్నీ, ఈ చైతన్యాన్ని నేను గ్రహించగలనా! భరించగలనా?' ఆమె గుండెలో ఉత్కంఠ, ఆనందం, ఎదురుచూపు, వేడికోలు...

నీలాకాశంలో నల్లమబ్బులూ, సూర్యుడి నారింజరంగు కాంతీ కలిసి రంగులచిత్రంగా ఏర్పడి, అద్భుతమైన సౌందర్యాన్ని సృష్టిస్తున్నై. క్షణక్షణానికి మారుతున్న దృశ్యాలు. ప్రతిక్షణమూ అంత సుందరంగానూ వుంది. అద్భుతమైన ఆ సౌందర్యంలో ఆమె మనసు మూగవోయింది.

ఎక్కణ్ణుంచో తాళాలశబ్దం...టంగ్‌టకా, టంగ్‌టకా...

టంగ్‌టకా, టంగ్‌టకా...విశ్వమంతా వ్యాపించి నవ్వుతూ, నర్తిస్తూ ఆమె గుండెల్లోకి చేరి, అక్కడ సంతోషంతో నాట్యం చెయ్యడం ప్రారంభించింది.

'అమ్మా, చంద్రికమ్మ తమాషబంగ్లా పిల్చుకొచ్చింది... ఒద్దంటే యీమె వినదు. పొమ్మంటే వాడు పోడు...' వంటామె ఫిర్యాదు.

అతను తెల్లగా, పొడుగ్గా వున్నాడు. మొహం పొడుగ్గా, గంభీరంగా వుంది. వయస్సు అరవైదగ్గర పడుతున్నా కళ్ళల్లో చురుకుదనం, జీవం నిండుగా వున్నాయి. 'అమ్మా, పాప పిలిచింది. పిల్లలూ, పెద్దలూ అందరూ చూడొచ్చు. ప్రపంచంలోని వింతలన్నీ వున్నై దీంట్లో...' అన్నాడు గంభీరంగా.

'ముప్పైపైసలకోసం ఎన్ని కబుర్లు చెబుతున్నావు!' అన్నది జయలక్ష్మి.

అతను నొచ్చుకున్నాడు. "పైసలకోసంకాదు...ఇది నావృత్తి. నేను ప్రపంచాన్ని చూపిస్తాను...పైసలు నేను బ్రతకటానికి" అన్నాడు,

అంటూనే బుజంమీది గోనెసంచీ దించి అందులోని పెట్టె తీశాడు. ఏండ[illegible]వాలు చూచుకొని స్టాండు అమర్చి పెట్టెపెట్టాడు.

చంద్రికతోపాటు జయలక్ష్మి కూడా దానిని చూడటానికి కూర్చున్నది.

టంగ్‌టకా...టంగ్‌టకా...ఒకచేత్తో తాళంకొడుతూ, రెండో చేత్తో తాపీగా బొమ్మలు మారుస్తూ రాగయుక్తంగా వర్ణిస్తున్నాడు...

ఆ బొమ్మల్లో నిజానికి విశేషం ఏమీలేదు కాని ఆ బొమ్మలే లెన్సులోంచి లోతునూ జీవాన్నీ గ్రహించి, రాగయుక్తమైన వర్ణనతో లయబద్ధమైన తాళంతో కలిసి వింతకథను సృష్టిస్తున్నై.

"ఢిల్లీపట్నం చూడండి
ఇంద్రాగాంధీ దర్బారు చూడండి
ఎర్రకోట చూడండి...టింగ్‌టకా, టింగ్‌టకా..."

రాధిక వచ్చింది. "ఏమిటమ్మా, నీవు కూడా చూస్తున్నావా? పక్కింటివాళ్ళు కిటికీలోంచి చూస్తూ ఎట్లా నవ్వుతున్నారో చూడు..." చెవిలో గుసగుసలాడింది.

"నవ్వుతోనీ...మధ్యాహ్నం తెచ్చిన కేకులు అలమార్లో వున్నై. నాకూ, చంద్రికకూ, అతనికీ మూడు తీసుకురా. తింటూ చూస్తే యింకా బాగుంటుంది. నువ్వు కూడా వచ్చి చూడు" అన్నది.

"నీవు కేకులు తినకూడదుకదా" అని విసుక్కుంటూ వెళ్ళిపోయింది రాధిక,

"గోవా సంద్రం చూడండి
సంద్రంలోన మంది చూడండి
ఆడా మగలా ఆట చూడండి...టింగ్ టకా, టింగ్ టకా...

ప్రదేశాలు, మనుష్యులు, లోకాలు మారిపోతున్నై. లండన్ నగరం, కాశీపట్నం, మహంకాళి ఉత్సవాలు; జపానీ గెయిషాలు, చంద్రలోకపు చిత్రాలు...ఒకదాని తర్వాత ఒకటి జరిగిపోతున్నవి, ఆకాశంలోని చిత్రాల్లాగా.

"మనలోకం చూడండి
ఈలోకం చూడండి
తమాషాల లోకం యిది
విచిత్రాల లోకం యిది
అందాల లోకంలో
ద్వంద్వాలలోకం...టింగ్ టకా, టింగ్ టకా..."

తిండికి బట్టకు రోదనా
నెత్తిన కష్టాకు వేదనా
రోగం చావు శోధనా...టింగ్ టకా, టింగ్ టకా...

అయినా

బ్రతుకుతానంటాడు మనిషి
నవ్వుతానంటాడు మనిషి
ఇక్కడే వుంటానంటాడు మనిషి...
టింగ్ టకా, టింగ్ టకా..."

జయలక్ష్మి నవ్వటం మొదలెట్టింది.

ఆమెతోపాటు చంద్రికా నవ్వుతోంది.

ఒకర్నిచూసి ఒకరు నవ్వుతూ వున్నారు.

"టింగ్ టకా...టింగ్ టకా...

నవ్వుల లోకం చూడండి
నవ్వేబాబులు చూడండి
నవ్వేపాపలు చూడండి
నవ్వొకటే నిజమండీ...టింగ్ టకా, టింగ్ టకా..."

తమాషా బంగ్లాలో రంగు రంగుల పాపలు, బాబులు నవ్వుతూ నిల్చుండిపోయారు...కథ అయిపోయింది...

ముసలతను డబ్బాతీసి గోనె సంచీలో పెట్టుకున్నాడు.

"మీ దేవూరు ? నీ సంసారం ఎక్కడుంది ?" అడిగింది జయలక్ష్మి.

అతను సంచీని తడుతూ "ఇదే నా సంసారం...రోజుపొద్దూ నాది"...అన్నాడు.

పైసలు జేబులో వేసుకున్నాడు.

తన ప్రపంచాన్ని బుజాన్నవేసుకుని వెళ్లిపోయాడు...

సూర్యుని ఎర్రని వెలుగు కన్పించనీయకుండా ఒక నల్లని చిక్కని మేఘం అడ్డంగా నిల్చుంది. వేపచెట్టు కొసలన్నిటిమీదా గోరింకలు వాలి గోల గోలగా అరుస్తున్నై. మేఘాన్ని చీల్చుకుని వెలికి రావటానికి ప్రయత్నించిన ఎర్రని మెరుపు ఆమేఘపు గుండెలోని లోతుల్ని ఒక్కక్షణంచూసి మళ్లీ లోనికే వెళ్లిపోయింది.

కొన కొమ్మలమీదనున్న గోరింకలు క్రిందికి క్రిందికి గెంతుకుంటూ నెమ్మదిగా చెట్టులోపలికి మాయమయ్యాయి. ఈ వెలుగువున్నంతసేపూ అనుభవిద్దామన్న కోరికతో రెండు గోరింకలు మాత్రం లోపలికి వెళ్లకుండా గొంతులు తగ్గించి కబుర్లాడుకుంటున్నై...

ఆమె మనసునిండా ఆనందం. నేను లేక పోయినా యిదంతా వుంటుంది. ఈ మనుష్యులు, చెట్లు, గోరింకలు, సూర్యుడు, ఆకాశం — అన్నీ ఎప్పటికీ వుంటాయి — అనుకున్నది జయలక్ష్మి ఆనందంగా.



# లలితకళలలో సాత్త్విక లక్షణం

శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

కదలిక లేక స్పందనము అన్నదానినుండి జన్మనెత్తిన అభినయము వ్యక్తిత్వాన్ని పొందటానికి కొన్ని ఉపాధులను చూచుకోవలసి వచ్చింది. అప్పుడు నటుని శరీరమూ, అందులోని సొగసులూ ఉపాధులైనాయి. ఈ ఉపాధిని సంతరించుకొన్న స్పందన, పాత్రరూప రచనతో మరో ఉపాధిని కలిగి, ఓ రూపాన్ని పొందింది.

అలాంటి అభినయానికి స్థూల స్వరూపమైన నటుని శరీరము స్పందనముతో కలిసినప్పుడూ లేదా స్పందనము అందులో ప్రవేశించినప్పుడూ అది ఆంగికంగా భాసించింది. ఆ తరువాత ఆ నటుని అంగానికి కూర్చిన పాత్ర రూపరచనద్వారా, రంగాలంకరణ ద్వారా ఆహార్యాన్ని కూర్చుకొంది అది.

ఇలా దృశ్య శ్రవ్యమైన అభినయం దృశ్యంవైపు కొంత బిందుదనాన్ని కూర్చుకొంది.

ఇంతవరకూ అభినయంలో సాహిత్యపరమైన పలుకుబడీ (శబ్దోచ్చారణ); సంగీత సంబంధమైన వాద్యవిశేషమూ, గీతాల స్వరకల్పనా ఒకటిగానే వాచికరూపంలో చెప్పబడుతూ వచ్చాయి. అలా అవి ఒకటిగా చెప్పబడటంవలన అభినయానికి తోడ్పడిన దృశ్య శ్రవ్యాలు సమతూకంలో ఉన్నట్లు అనిపించటంలేదు. అందుకని దృశ్యంవైపు ఉన్న, ఆంగిక ఆహార్య ఉపాధులకు సమంగా శ్రవ్యంవైపూ వాచిక వాద్య ఉపాధులను చెప్పుకొంటే అభినయం దృశ్య శ్రవ్యం అన్నదానికి ఎంతో ఉదాత్తత వస్తుంది అని అనిపిస్తుంది.

యథార్థానికి వాచికాన్ని వాచిక వాద్యాలుగా విడదీయటానికి వీలు లేదు. ఐనా, సమత కొరకూ, ఓ అవగాహన కొరకూ అలా విడదీస్తే బాగుంటుందేమో మరి.

ఈ ఆంగిక ఆహార్యాలూ, వాచిక వాద్యాలూ సమతూకంలో, సమస్థాయిలో అభినయానికి దోహదకారులై, అందులో సంయోగమైనప్పుడు విభావ అనుభావ వ్యభిచారీ భావాలతో రసం పరాకాష్ఠ చెందుతుంది. అప్పుడు అభినయానికి ఆవల ఉన్న ప్రదష్టలు స్థాయీ భావాన్ని అందుకుంటారు. ఆ దశలో ఆ అభినయం దానంతట అదే సాత్త్వికాభినయంగా భాసిస్తుంది. రసజ్ఞులూ సాత్త్వికస్థాయి భావాన్ని అందుకుంటారు.

ఇక నటుడు అంటారా, ఎలాగూ సాత్త్వికం మనోజనితం కనుక, నటుడూ తనలోని సాత్త్వికభావాన్ని అభినయానికి దాని ఉపాంగాలైన ఆంగిక ఆహార్య, వాచిక వాద్యాలకు జోడిస్తాడు. అప్పుడు అతను చూపించే ప్రతి భంగిమా, మాట్లాడిన ప్రతి పలుకూ, పాడిన ప్రతి గీతమూ అతనిలోని సాత్త్వికతతోనూ విభావ అనుభావ వ్యభిచారీ భావాలతోనూ ప్రతిబింబమౌతూనే ఉంటాయి.

అప్పుడు నటుడూ తనకుగా తాను సాత్త్వికాభినయంలో అనుకోకుండా తాదాత్మ్యం పొందుతాడు.

* * *

అభినయంలోవలెనే చిత్రకళ రూపొందటానికి తోడ్పడిన మాధ్యమాలు రూపమూ, రంగూ. అవి రెండూ సమతూకంలో, సమస్థాయిలో భావయుక్తంగా కలిసినప్పుడు; ప్రదష్టలలోని భావాలూ, రసాలూ పతాకస్థాయిని అందుకుంటాయి. అప్పుడు ఆ చిత్రం సాత్త్విక రూపరచనగల రూపకృతి ఔతుంది.

అలాంటి రూపరచనలోని రూపాన్నీ, రంగునీ పరిశీలిస్తే—

అభినయంలోని ఆంగికంవలె చిత్రరచనలోని రూపం భావాన్ని కంటికి అందిస్తుంది. ఆ రూపంలో పొదగబడిన రంగు, అభినయంలోని వాచికంవలె, రూపభావాన్ని రసంతో నింపి, ఆ రూపగత భావానికి ఓ రకమైన వాసననూ, శక్తినీ ప్రసాదిస్తుంది. కనుక చిత్ర రచనలో రూపం ఆంగికంగా భాసిస్తే, రంగు వాచికంగా భాసిస్తుంది.

ఈ రెంటి సంయోగ సంయోజనాల వలన చిత్రకళా జగత్తులో సాత్త్విక రూపరచన ఆవిష్కరింపబడి; రసాన్ని అంటిపెట్టుకొని ఉన్న విభావ అనుభవాలు ప్రదష్టమానసంలో మేల్కొని సంచారీ భావాలను సృజిస్తుంటాయి. అప్పుడు రూపరచనలోగల రసమయ స్థాయీ భావనను అందుకుంటాడు ప్రదష్ట.

*

ఇక మూర్తి తత్త్వంగల శిల్ప నిర్మాణాన్ని పరిశీలిస్తే—

శిల్పంలో ఏ కోణంలోనన్నా చూడగలిగే ఆకృతి ఉంటుంది దానిని విశ్లేషించుకొంటే; మూర్తీ, అందులోని లయా, అన్నీ

మిగులుతాయి. ఐతే చిత్రరచనలోగల రూపంలో, లయ లేదా, అనే అనుమానం రావచ్చు. కానీ చిత్రంలో ఉండే రూపలయకన్నా, చిత్రంలో ఉన్న రంగే ఎక్కువ శక్తివంతంగా కనిపిస్తుంది అందుకని చిత్రంలో ఉన్న రూపలయకన్నా; మూర్తి రచనలో లయకు ఎక్కువ ప్రాధాన్యం ఈయబడుతుంది నిర్మాణంలో. పైగా మూర్తి రచనలో రంగులేదు కనుక ఆ రంగు స్థానాన్ని మూర్తిలోని లయ భర్తీ చేయ వలసి ఉంటుంది. కనుకనే మూర్తి రచనలో లయకు అంత ఎక్కువ ప్రాధాన్యం ఈయబడింది.

ఇలాంటి శిల్పరచనలో, మూర్తి మొదటి భావాన్ని మాత్రమే ఇస్తుంది. ఆ తరువాత మూర్తివలన పొందిన ఆ భావం మధుమయం, రసమయం ఔతుంది అది అలా అవటానికి మూర్తిరచనలోని సౌంద ర్యంలోగల ఒంపు సొంపులూ లలితమైన వ్యక్తీకరణే కారణం అవి మూర్తి రచనలో లయరూపంలో ఉంటాయి. కనుక మూర్తిలోని లయ మూర్తి రచనకన్నా కొంత విభిన్నతను కలిగి, రసతత్వ స్వభా వాన్ని కలిగి ఉంటుంది. అందుకని మూర్తిలోని రూపం వేర్వూ, ఆ మూర్తి భంగిమనుండి తొంగిచూచే లయవేరూ ఔతోంది.

వీనిని పరిశీలిస్తే.

శిల్పరచనలోని ఆకృతి అభినయంలోని ఆంగికంవలెనూ, అందు లోని లయతో కూడిన భంగిమ, భావాన్ని రసవత్తరంగా ప్రస్ఫుటం చేసే వాచికంవలెనూ భాసిస్తూ ఉంటుంది. ఎందుకంటే, అభిన యంలో ఆంగికం స్థూలం. వాచికం సూక్ష్మం. అలానే మూర్తి రచ నలోగల ఆకృతి స్థూలం. అందులోని లయ సూక్ష్మం. ఆ లయవలనే మూర్తి తన భంగిమలోని భావాన్ని ఎంతో లలితంగా వ్యక్తం చేస్తూం టుంది. ఓవేళ శిల్పంలోని మూర్తి రచన, లయ రహితంగా ఉంటే; ఆ మూర్తి కేవలం ఘనాత్మకంగా ఉండి, జడంగానే భావాన్ని స్తబ్ధ తలో వ్యక్తపరుస్తూ ఉంటుంది. కానీ ఆ మూర్తే లయ సహితమై భంగిమాయుతమైంది ఐతే, ఎన్నో రమణీయ రసభావాలనూ, ఎన్నో విభావాలనూ అనుభావాలనూ రసహృదయంలో పరచగలిగే రసమూర్తి ఔతుంది. కనుక శిల్పరచనలో, వాసనా, శక్తీ భంగిమలోని లయవలన కలుగుతున్నవి

అందుకని శిల్పరచనలో, స్థూలతత్వం కలిగి ఆంగిక స్వభావం కలది రూపమూ లేక ఆకృతి. సూక్ష్మతత్వం కలిగి, వాచికంలోని ద్రవీకరణ స్వభావాన్ని కలిగినది లయాన్విత భంగిమా, లేక భంగి మాంతర్గత లయ.

ఇవి రెండూ సమతూకంలో, సమస్థాయిలో భావాన్ని పెనవేసు కొని శిల్పరచనతో సంయోగమై నప్పుడు ఆ శిల్పరచన ఆవలి ద్రష్ట లలో వ్యభిచారీ భావాలను సృష్టించి రసాన్ని పరాకాష్ఠకు తీసుకొని పోయి స్థాయీ భావాన్ని ద్రష్టకు అందిస్తుంది. అప్పుడు ఆ శిల్పం సాత్వికమైన మూర్తిరచనగా ఆకృతి రచనగా భాసిస్తుంది రస జగత్తులో.

* * *

ఇకపోతే, సంగీతంలో అతిసూక్ష్మపదార్థాలూ; అతి సూక్ష్మ విన్యాసాలూ ఉన్నాయి. ఆ సూక్ష్మపదార్థాలే స్వరాలు. ఆ అతి సూక్ష్మ విన్యాసాలే తాళగతులూ.

మన దృష్టిని ఇక్కడ కొంచెం ముందుకు పోనిస్తే—

రాగజగత్తులో ఏ స్థాయిలోని స్వరమైనా ఆంగిక స్వభావం కలదిగానూ, ఆ స్వరవిన్యాసం వలన ఏర్పడిన రాగంలోని గతి, లేక తాళమూ వాచికంగానూ భాసిస్తూ ఉంటుంది.

ఎలా అంటే, నిశ్చలమైన ఓ స్వరాన్ని తీసుకొని పరిశీలించి నప్పుడు అది జడంగానే భాసిస్తుంది. అది వివిధ గతులలో సంచ రిస్తున్నప్పుడే ఆ స్వరానికి శక్తీ, శబ్దము అన్నవి వస్తాయి. కనుక నిశ్చలంగా ఏమార్పూ లేకుండా సాగిపోయే స్వరం ఆంగికం. వివిధ గతులలో వివిధస్థాయిలలో సాగిపోయి భావాన్నీ రసాన్నీ, స్ఫురింపజేసే గతి సహితమైన తాళం వాచికం.

అసలు స్వరం అనేదే చలన సహితం గదామరి; అది నిశ్చలంగా ఎలా ఉంటుంది అనే అనుమానం రావచ్చు మనకు. రాగ జగత్తులోని ఓ స్వరం, ఓ స్థాయిలో ఏమార్పూ లేకుండా శృతివాద్యంలోని నాదంవలె సాగిపోతున్నప్పుడు ఆ స్వరం స్థిరమైందే ఔతుంది.

ఇలాంటి రాగజగత్తులో స్వరాలూ గతి, సమస్థాయిలో, సమ సాంద్రతలో జంటగా ఓ భావంతో సాగిపోతే ఆరాగం సాత్విక సంగీత రచనగలది ఔతుంది. ఆ దశలో ఆరాగాన్ని వింటూఉన్న వారిలో భావాలూ, రసాలూ, పరాకాష్ఠచెంది స్థాయీభావాన్ని అందిసాయి. అప్పుడు ఆ సంగీత రచన రసహృదయంలో సాత్విక సంగీత రచన ఔతుంది.

* * *

ఆ తరువాత సాహితీ రచనను తీసుకొంటే, పదాలు అర్థాల నిస్తాయి. కేవలం అర్థప్రాధాన్యంగల పదాలు జడాలే ఔతాయి. ఆ పదాలు కమ్మని శబ్దాల కూడికైతే అవి మధురంగా ఉంటాయి. కనుక సాహితీ జగత్తులోని పదం ఆంగికం. దానిని అంటిపెట్టుకొని ఉన్న శబ్దం వాచికం.

శబ్దంలేంది పదం నీలా ఔతుంది, అనే అనుమానం రావచ్చు. శబ్దం అంటే అర్థంతోకూడి తిరిగి తిరిగి వినాలనిపించే ఉత్సుకతను కలిగించేది అని భావం. పదాలను మనం మాట్లాడుతాం దైనందన జీవితంలో అర్థమవటానికి. శబ్దాలను సాహిత్యంలో వాడుతాం రస నిష్పన్నము కొరకు.

కనుక పదం అర్థాన్నిస్తుంది. ఆపదం శబ్దమాధురి కలధైతే, ఆ శబ్దంలో వాసనా, శక్తీఉంటుంది. అప్పుడు అది కేవలం అక్షర బద్ధమూ, అర్థబద్ధమేకాక వాసనతోకూడింది ఔతుంది. అప్పుడు ఆ శబ్దం వాచిక స్వభావం కలది ఔతుంది.

అందుకవే సాత్వికమైన సాహితీ రచనలో పదం శబ్దం భావాన్ని పెనవేసుకొని సమతూకంలో, సమస్థాయిలో చేతులు కలుపుతాయి. అప్పుడు ఆ రసకృతికి ఆవలఉన్నవారిలో రేగిన సంచారీ భావాలు పరాకాష్ఠ చెంది, రసాన్ని ఆవిష్కరించి స్థాయీ భావాన్నీ, సాత్వికతనూ ప్రసాదిస్తాయి.

* * *

ఇలా ప్రతి కళలోని భౌతికత ఆ కళలోని అంగికంగానూ; ఆ కళలోని అభౌతికత ఆ కళలోని వాచికంగానూ భాసిస్తూ ఉంటుంది. కనుక ఆంగికంలో కళను రూపొందించే పదార్థాలు ఉంటే; వాచికంలో భావాన్నీ, రసాన్నీ ఆవిష్కరించే సౌందర్యతత్వంలోని అనుషంగికాలు చోటుచేసు కొంటాయి. మొదటిది రసకృతికి అస్తిత్వాన్నిస్తుంది, రెండవది చేతనత్వాన్నిస్తుంది. ఒకటి పదార్థ సహితం; రెండవది దానిమీద ఆధారపడిన చేతనం. మొదటి దానిలో ఆలంబనఉంది; రెండవదానిలో దానిని అంటిపెట్టుకొనిఉన్న వాసనా, శక్తి అన్నవి ఉన్నాయి.

అందుకని ప్రతి రససృష్టిలోనూ ఇవి రెండూ సమపాళ్ళల్లో ప్రవహిస్తే, ఆ రససృష్టి, సాత్విక రసశీలియై సాత్విక రసకృతిగా భాసిస్తుంది రసజగత్తులో.

అలా భాసించే ఆ సాత్విక రసకృతిలోగల రసచేతన, సామాన్యులకూ, రసజ్ఞులకూ, ద్రష్టలకూ రసతాదాత్మ్యతను కలిగిస్తూ లీనా లీనావస్థను వారిలో కలిగిస్తూ ఉంటుంది.

ఇలాంటి వాటిని సృష్టించే రూపకారుడూ, శిల్పీ, గాయకుడూ, కవీ, నటుడూ వారి మనోజనితంనుండి పెల్లుబికిన సాత్వికంతో కళా సృష్టిలో తాదాత్మ్యతను పొంది తమను తాము మర్చిపోతుంటారు.

అందుకే సాత్వికం రసంలో రసతత్వంలో ఓమ్మూల ధాతువుగా, ఓమూల స్వభావంగా భాసిస్తూ ఉంటుంది.



# జన్మభూమి

[నాయని సుబ్బారావు: డెమ్మీ 250 పుటలు; వెల రు 5/– ప్రతులకు – గ్రంథకర్త; 8-3-898/5; నాగార్జున నగర్, హైదరాబాదు–500873.]

1920 సంవత్సరపు దశాబ్దంలో, "సాహితీ సమితి" నవ్యాంధ్ర సాహిత్యరంగంలో ప్రవేశించినది మొదలు, నాయని సుబ్బారావు సాంప్రదాయిక కవిగా వినబడుతూ, చదువబడుతూనే ఉన్నాడు. అనాడు ఈయన సౌభద్రుడు. మెత్తటి మనిషి, కాబట్టే ఈయన భావాలు భాష మెత్తనైనవి. ఈయన దేశాలు తిరిగి, చివరకు హైదరాబాదులో స్థిరవాసం ఏర్పరచుకొన్నా, అభిజనం — ఆ పొదిలిపై ఈయనకు మక్కువ తరుగలేదు. చిన్ననాడు "సెలవులిచ్చిరో లేదో, మెడ పల్పులూడ్వ నం బేయంచు నెగిరి తల్లులకునై దూకు లేగల వడువున, పోయి పడుదుము ప్రతుటెలోన పొదిలెలోన" అంటూ, ఆ చిన్ననాడు కనిపెంచిన ఆ వేలతీపు మరువక — "ఇతర జనపదముల నేను ప్రవాసినై, మఱచియైన మేను మఱచియైన, కన్నతల్లి పొదిలె యున్న దిక్కున కాళులుంచియెపుడు పవ్వళించలేదు" (అవతారిక – 14 పద్యం) అని ఆ పట్నం పట్ల నేటికీ గౌరవం చూపుతున్నాడు. మంచి ఉదాత్తభావం.

ఇట్లే తన వెలమ కులాన్ని — కులాలన్నీ ఒక మాని కొమ్మలే అంటూ ఘనపరచి, తన వంశాన్ని మాన్యపరచి, తన చుట్టాలను సగర్వంగా కీర్తిస్తున్నాడు. ఇది స్వార్థచింత కాదు—సత్య నిష్ఠ అన వచ్చు. పెంచి, పెద్దజేసి, విద్యాబుద్ధులు గరపిన, పండితుడు-విమర్శకుడు—న్యాయవాది—అన్న నరసింహారావుగారిని ఎంతో పెద్దజేసి, ఈ కావ్యాన్నే ఆయనకు అంకితమిస్తున్నాడు. ఆ అన్నపైన ఈయన కున్న భక్తి అపుటమైనది. సుబ్బారావు కుటుంబంలోని వారంతా మంచి చదువరులు. ఇప్పటికీ ఆ చదువుల రాణి అందెల గలగలలు ఆయింట వినబడుతునేఉన్నవి. సుబ్బారావు కుమార్తె—నాయని కృష్ణ కుమారి డాక్టరేటు బొందిన విదుషీమణి. ఇందు, తమ చుట్టాలు పలుగురి ఫోటో ముద్రించి చేర్చినారు. క్రింద పేర్లు లేనందున వారెవరో ఏర్పరచుకోలేకపోతున్నాడు-పాఠకుడు. దీనివల్ల అనుకొన్న ప్రయోజనం ఏర్పడటంలేదు.

ఈ కవి, తన జన్మభూమి భూగోళంతో — స్థానిక దేవతల మహిమలు చరిత్రలతో స్వకీయ జీవితాన్ని (అవతారికలో) కలిపి పెన వేసి, ఒక సాంప్రదాయిక ప్రబంధాన్ని సృష్టించినాడు. కట్టుకతలకు, పుక్కిటి పురాణాలకు చరిత్రాంశాల స్థాయినిచ్చి, విన్నది కన్నది వ్రాసి వినిపిస్తున్నాడు. ఇది ఒక స్థలపురాణ ప్రబంధం. పొదిలెసీమ రాజకీయ సాంఘిక చరిత్రను వర్ణించి గ్రంథానికి ఒక చరిత్ర గౌరవాన్నిగూడ చేకూరుస్తున్నాడు. స్వర్గాదపి గరీయసి అయిన జన్మ భూమి ఋణాన్ని ఇట్లా చెల్లించుకొంటున్నాడు-కవి.

ఈ గ్రంథం రెండు విభాగాలుగా ఉన్నది: ఒకటి : తనయ— డాక్టర్ కృష్ణకుమారి వ్రాసిన వచన పీఠిక; ఇది పొదిలెసీమ సమగ్ర రాజకీయ చరిత్ర. ఈ కావ్యానికి అక్కడక్కడా వ్యాఖ్యాన ప్రాయంగా ఉన్నది. రెండవభాగం : ఈ వచన రచనకు తండ్రి అల్లిన పద్య రూపం. అందువల్ల రెంటినీ వేరువేరుగా పరికిస్తాం.

## పీఠిక - చరిత్రాంశాలు

పొదిలె అనేమాట "పొదుళ్" అనే ద్రావిడ బాషాపదమే — సందేహంలేదు. అయినా "పొదియిల్ కొండ" కు అరవదేశం అంత దూరం పోవడమెందుకు ? "పలువురు నడచెడు తెరువున పులు మొలువదు, మొలచెనేని పొదలదు" అని సుమతే అనిఉన్నాడుగదా. స్థానిక గ్రామదేవతలు—దేశ గ్రామ చరిత్ర—దండకవిలెలు—శాసనాలు ఆధారంగా చేసుకొని పొదిలెనాటి సమగ్ర రాజకీయ చరిత్ర వ్రాయబడి ఉన్నది. చాళుక్యులు, చోళులు, కాకతీయులు రెడ్లు గజపతులు గోల్కొండ నబాబులు-నిజాములు విజయనగరంవారు, ఈ ప్రాంతాన్ని 7 వ శతాబ్దం మొదలు పాలించి ఉన్నారు. చివరకు వెంకటగిరి వెలుగోటి వారికి సంక్రమించి, ఇప్పుడు రైతుల పరమై పోయిఉన్నది. వెంకటగిరి జమీందారు ఈ దర్శి—పొదిలి రాజ్యాన్ని మూరెళ్లసీమ అనేవారు; దీనిని ఈమె పేర్కొనలేదు.

## నాడులు

పొదిలె కమ్మనాటిలోనిది అని అంటూ నెల్లూరు, ఉదయగిరి, కందుకూరు, ఒంగోలు ప్రాంతాలు కమ్మనాటిలోనివి అని (4 వ పేజీలో) వ్రాస్తున్నారు. అసలు ఈవిషయమై ఒక నిలుకడ భావాన్ని ఈమె మనసులో నిలదొక్కుకొన్నట్లు కనబడటంలేదు; ఎందుకంటే— ఇందే 11వ పారటలో "ఏది ఏమైనా కావలి, కందుకూరు, ఒంగోలు, పొదిలె తాలూకాలుగల సీమ పాకనాడుగా పరిగణింపబడేదన్న విషయం నిస్సంశయమైనది" అని వ్రాస్తూనే మరల 14వ పేజీలో "ఉదయ

గిరి మొత్తం కమ్మనాటి కింతటికి రాజధాని" అని భిన్న భిన్నరీతులలో చెపుతున్నారు.

ఇంతకూ ఈనాడులను గురించి పండితాభిప్రాయం ఇది: (చినవేదం వెంకటరామశాస్త్రి, వేలటూరు వెంకటరమణయ్య) 1. పాకనాడు:– ఒంగోలుకు దక్షిణం, కనిగిరి, కందుకూరు తాలూకాలు, ఉదయగిరిలో కొంత, కావలి, నెల్లూరు, వెంకటగిరి తాలూకాలు – నెల్లూరు పట్టణం ఇందు అంతర్గతము – ఈ పాకనాడు ఉదయగిరి రాజ్యంలోనిది. ఇది పల్లవులనాటి పేరు. పొదిలె సీమ పాకనాటి లోనిది అని వీరి అభిప్రాయం. 2. కమ్మనాడు:– కర్మరాష్ట్రం, కమ్మ విషయం అనేది–నరసారావుపేట, బాపట్ల, ఒంగోలు ఉత్తర ప్రాంతం. 3. పంటనాడు: నెల్లూరుజిల్లా గూడూరు తాలూకా, పల్లవులకు ముందు నెల్లూరు కోవూరు తాలూకాలకు ముండనాడనిపేరు. ఒక జైనుని పాలనలోఉన్నందున అని–వెంకట రమణయ్య.

## శ్రీనాథుని జన్మభూమి

మనదేశ చరిత్ర ఇంకా ఊహాపోహలనుండి బయటబడి, కుదిరిక ఏర్పరచుకోలేకున్నది. అందులో కవి సార్వభౌమ శ్రీనాథుని జన్మస్థలం ఒకటి డా. కృష్ణకుమారి పెదనాయన–నరసింహారావు చరిత్రను పరిశోధించి, ఒంగోలుకు తూర్పునవున్న పాదర్తియే కాల్పట్టణంగా నిర్ణయించినారని చెప్పతున్నారు. కాని, డాక్టర్ వేలటూరు వెంకటరమణయ్య, చిన వేదం వారు తుదిమాటగా ఇట్లంటున్నారు: హరవిలాసం అంకితం పొందిన అవచి తిప్పయ్య శ్రీనాథుని బాల్య సఖుడు–అంటే–చిన్నప్పుడు ఆడుకొన్న సహవాసగాడు. ఈ శెట్టిది నెల్లూరు. వీరి వ్యాపారశాఖ కాంచీపురంలో ఉండినది. సింగరాయకొండ, దానిదగ్గరి కలికివాయి బిట్రగుంటలో అవచివారు చాలాకాలంగా నివసిస్తుండినారు. సింగరాయకొండను అనుకొనిఉండే సోమరాజపల్లెలో మహాకవి–పిల్లలమర్రి పెదవీరభద్రుడు ఉండినాడు. ఆయన బడిలో శ్రీనాథుడు, తిప్పయ్య చదువుకొన్నారు. చిన్నప్పుడు ఒకటిగా చదువుకోవాలంటే, ఆ చుట్టు పట్టులలోనే, లేదా నెల్లూరులోనే వీరిద్దరు నివసిస్తుండాలిగదా. ఇంకొక పాకనాటి నియోగి–కుమార ధూర్జటి, తన ఇందుమతీ పరిణయంలో "...తనదు శ్రీనాథత్వ మనుపమ నృప సభాంతర చిత్ర రచన బంధురిత మెరయ...నెల్లూరు నెరజాణ సభి నుతింతు" – అంటాడు. నెరజాణలు నెల్లూరు వారేగదా! శ్రీనాథుని తాత పాలించిన క్రాల్‌పట్టణం, నెల్లూరుకు ఆగ్నేయంగా ముత్తుకూరు దగ్గరఉండే కృష్ణపట్టణమే అని నిరూపిస్తున్నారు. మొట్ట మొదట చిలుకూరు వీరభద్రరావు గూడ ఇదే నిర యానికి వచ్చి ఉండినారు. ఈ కంప్లేటి పట్నం ఇప్పుడు భూరి నౌకాశ్రయంగా నిర్మింపబడుచున్నది.

ఈ పొదిలె ప్రాంతం పింగళిసూరన్నకుగూడ సంబంధమున్నదని–కృష్ణకుమారి. మంచి విషయమే.

## కర్ణాటదేశం

కర్ణాటదేశానికి కన్నడానికీ సంబంధంలేదు. (కర్ణాటి సంగీత మన్నట్లు) కర్ణినాడు–శాతకర్ణి ఏలినదేశం కర్ణాటకమని ఒక ప్రతిపాదన. బళ్ళారి, అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు మండలాలే ఆనాడు కర్ణాటదేశంగా వ్యవహరింపబడుతుండినవి – (డా. వే. వెం.) ఈ ప్రాంతపు భాషనే శ్రీనాథుడు మాన్యపరచి, తనది కర్ణాటభాషఅని రాజ మహేంద్రవర పండితలోకంలో ఢంకా కొట్టి చాటినాడు.

ఇట్లా ఈ పీఠిక 1200 ఏండ్ల పొదిలె చరితను చక్కగా విప్పిచెప్పి స్థలాభిమానాన్ని రేకెత్తిస్తున్నది. ప్రస్తుతం ఈఆనందాన్ని నెల్లూరువారికి మారు ప్రకాశంజిల్లావారు పొందగలరు.

## సుబ్బారావు పద్య ప్రబంధభాగం

ఈ పీఠికాంశాలనే సుబ్బారావు పద్య ప్రబంధరూపంలో సృష్టించినాడు. ముందే చెప్పకొన్నాముగదా–నాయని వారికి సాంప్ర

దాయికి వాసనాబంధురమైన మానసమని! అట్లని నవ్య వాసనలను వెలివేసిన మనసుగాదు—వీరిది.

ఈ కవిత సంస్కృత ప్రౌఢ దీర్ఘతర సమాసాలతో, మాండలిక జానుతెనుగు నుడికారంతో, కొత్తపాతల అభిరుచులకు తృప్తి నిస్తున్నది. తెనుగుదనం పల్లెల తీరు తియ్యాలతో ఒప్పారు తున్నది. ఈయన పేర్కొం పంటలు, గుట్టలు, వాగులు వర్ణించే పట్టులలో గ్రామీణ కర్షక కవి (ప్యాస్టరల్) అని అనిపించుకొంటున్నాడు. "ఏ పుణ్యమ్మొ చెమర్చి వానపడునో యీ వేలపైనంచు" (51 పేజి) "నాగరిక ముద్ర విరుగని నాటు పురము" (50 పే) అవి, మధురమైన భావము భాషలతో పల్లెల అకళంకమానసాన్ని వర్ణించి ఆ జానపద జీవనాన్ని ఎత్తిపెట్టుతున్నాడు. ఆ చుట్టుపట్లగల రాళ్లు రప్పలు గుట్టలలో బ్రహ్మస్వరూపాన్ని అనుసంధించుకోగలిగిన స్థాయికి కవి మనసు చేరుకొనిఉన్నది. నిజపరిచిత స్థానాలను ఆనంద తన్మయతతో నుతిస్తున్నాడు.

సుబ్బారావు ఇందు అసంఖ్యాకములైన సంస్కృత వృత్తాలను చేపట్టి చాల పద్యాలు సొబగుగానే వ్రాసిఉన్నాడు. ఇది తిక్కన స్త్రీపర్వంలో చేసినపని ఈ కవితారీతి ఛందోజ్ఞానాన్ని చూపను చేపట్టబడినా వెగటు గొట్టటంలేదు.

చెట్టు చేమలను వర్ణించిన సందర్భంలో ఒక విసరు విసరాలని అనిపిస్తున్నది. ఇది పోతనామాత్యుని పద్ధతి :

45 వ పొంట 57 వ పద్యంలో శార్దూలంలో—

బీజాపాస మదేమియున్నలదు, నీర్వెట్టం బనిలేదు, స్వే
చ్ఛాజీవమ్ములు వింతవింత తరు:- లశ్వత్థామ్ర శాండిల్య కో
లి బంబూ వట శిగ్రు దంతశర గోలీథా మ్లికా కాక చిం
చీ జీమూత జపా జటీ క్రము లింటి సర్వతో భద్రముల్ !

అని పొదిలెను ఒక ఓషధీశునిగా వర్ణించినాడు. స్వస్థలాభిమానం మంచిదే! కాని వీటి అర్థం అటుండనిచ్చి, ఇక కొంతకాలం పోతే పద విభాగమే తెలియకుండా పోవచ్చు. ఇట్లనే యుద్ధాలలో వర్ణించే—ముద్గర తోమర కుంతలాది ఆయుధాలు గూడ వస్తురూపం తెలియకుండా పోవచ్చు.

ఈ చెట్లన్నీ ఒకేసమయంలో ఒకే పట్టులో మొలచే చోటు ఒక్క నిఘంటువు మాత్రమేననికదా కట్టమంచి రామలింగారెడ్డి ఎగతాళి చేసినది.

— శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి.



# కొత్త చిన్న మొత్తాల పొదుపు సెక్యూరిటీలమీద ఎక్కువ వడ్డీ

*1. 7 సంవత్సరాల జాతీయ పొదుపు సర్టిఫికెట్ (5) విడుదల:*

ఏడాదికి $10\frac{1}{4}$ శాతం చొప్పున ప్రతి ఏటా వడ్డీ చెల్లింపు
(వ్యక్తులకు మాత్రమే)

*2. పోస్టుఆఫీసు (టైమ్ డిపాజిట్లు):*

రూ. 50 గాని, దాని గుణాంక సంఖ్యలోగాని లభిస్తాయి.
ఎంత మొత్తమైనా మదుపు పెట్టవచ్చు.
(వ్యక్తులకు మాత్రమే)

## వడ్డీ

| | | |
|---|---|---|
| ఒక ఏడాది టైమ్ డిపాజిట్ | ... | 8 శాతం |
| రెండేళ్ల టైమ్ డిపాజిట్ | ... | $8\frac{1}{2}$ శాతం |
| మూడేళ్ల టైమ్ డిపాజిట్ | ... | 9 శాతం |
| నాలుగేళ్ల టైమ్ డిపాజిట్ | ... | 10 శాతం |

*3. పోస్టుఆఫీసు (రికరింగ్ డిపాజిట్లు):*

నెలనెలా రూ. 10 చొప్పున మదుపు చేస్తే 5 సంవత్సరాల తర్వాత రూ. 750 లు అవుతాయి.
వడ్డీ $9\frac{1}{4}$ శాతం

రాష్ట్ర కమీషనరు,
చిన్నమొత్తాల పొదుపు, రెవిన్యూబోర్డు,
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు

No. DIPR/17/C 3/76

# కలగూరగంప

## కనిగిరి లో దుర్గము

ప్రపంచమందలి ఖండములలో- భరతఖండమునకుండు ప్రశస్తి అద్వితీయమైనదన్న విషయము సర్వజనాంగీకారమైనది. అందును ఆంధ్ర దివ్యదేశ విఖ్యాతి వర్ణనాతీతమైనది. ఇందులకుంగల కారణములలో గోదావరి, కృష్ణవేణి, పినాకిన్యాది-పుణ్యసరిత్తులు-శ్రీ శేష శైల-శ్రీ శైలాది-దివ్యదేశములు—బంగారు పంటలుపండు బంగరు భూములు-ఇత్యాదులచేత—ఈ రాష్ట్ర ప్రసిద్ధి ఖండఖండాంతరములందు వ్యాపించియున్నది. అట్టి ఆంధ్రదేశము తిక్కనాది మహాకవులచేతను మనుమసిద్ధి-కాటమరాజాదులచేతను-నెల్లూరుధాన్యముచేతను- ఈ కీర్తి 'సీమ'దాక వ్యాపించినది.

అట్టి నెల్లూరు మండలమున 'కనిగిరిసీమ' ఒక విధముగ చారిత్రాత్మకస్థలముల నొకటి. ఈ గ్రామము యొక్క ప్రాశస్త్యమును-మున్నెందరో వివరించియున్నను మరికొన్ని నూత్నాంశములతో సమీక్షించుటయే నా రచనలో ముఖ్యోద్దేశము.

## కనిగిరి -నామనిర్వచనము

'కనకగిరి'నుండి యుత్పన్నమై వ్యావహారికమైన నామమే 'కనిగిరి' యని పలువురి యభిప్రాయము ఆంధ్ర కవితా పితామహుడు రాయల దిగ్విజయముల నుగ్గడించుచు మనుచరిత్రలో వర్ణించిన 'కనకగిరి' యిదేనని పలువురి యూహ ఎన్ని మారుచున్న పేర్లను మనము చూచుచున్నారముకదా! 'చెన్నపట్టణము' క్రమముగ రూపుమాసి 'మద్రాసు' శ్రీ రాయసం కొండమరుసుపేర-వెలసిన 'కొండమరుసుపాళెం' కొండముచ్చుపాళెం. ఇట్లనేకములు—'బెజవాడ'యే సరియైన రూపము. మనవారి వింతపరిశీలన— 'విజయవాడ'గా మారింది. ఇంకముందు...''విజ్యాడగ'' మారదను నిర్ణయమేమి. గంటకొట్టినట్లుగు పండరంగపరమేశ్వరు—ఆదిత్య భట్టారకునకు వ్రాసిచ్చిన దానశాసనం 'కణ్ణా ఘూర్పె జవాడగాలించ్చిజంచ్చె' అని యుండుగ అర్థములేని ఏవో యూకదంపుడు యూహలతో నేలవిడిచి సాము చేయుటగాక ఏమగును నా ''కందుకూరు సీమ'' చరిత్ర:

కనిగిరిసీమ సంబందించిన శాసనాళిని పరిశీలించినచో కటకపురాధీశ్వరుండగు రుద్రుడీ సీమ పాలించినట్లుగను—ఆతడే—యీ దుర్గమును నిర్మించి తన విజయసూచకమో అనునట్లు 'విజయమార్తాండదుర్గ'మని పేరిడినట్లు చరిత్ర పుటలలో కనుపడుచున్నది. ఆతని పిదప నాతని వంశస్థులీపరిసరములను కొంతకాలము పరిపాలించిరి.

నట్లను, ధ్వనితమగుచున్నది. పైగా ప్రతాపరుద్ర యశోభూషణ ప్రతిపాదితుడగు ప్రతాప రుద్రుడతని సంతతివాడని యూహలు.

ఆ రుద్రుడీ కోట నిర్మించుటేగాక - రాజ్యవిస్తరణాభిప్రాయముతోను—తన దుర్గము పటిష్ఠముగనుండుటకో యనునట్లు ఈ కనిగిరి దుర్గమున-కొంత సైన్యముంచినట్లు - దుర్గములోని కొన్ని చిహ్నములు కనుపడుచున్నవి. త్రవ్వకములలో ననేక ప్రాచీన వస్తువులును కనుపడుచున్నవి.

ఈతని కుమారుడు పురుషోత్తముడు సార్థక నామధేయుడైన—సేనానిగను—సమర్థుడైన రాజ్యపాలకుడుగను పేరుగాంచెను. ఇతని కుమారుడు-వీరరుద్రుడు ఈతడు విజయనగరాధీశ్వరుండైన శ్రీకృష్ణదేవరాయ మహీజానిచే నోడింపబడెను. ఆవిజయనగర ప్రభువుల యనంతరము—ఈ ప్రాంతమందలి దుర్గములు-గోల్కొండ నవాబులకు స్వాధీనమాయెనని తెలియుచున్నది 17 ప్రాంతము మైసూరు నవాబగు 'హైదరాలి' ఈ 'కనిగిరిసీమ'ను జయించి—పట్టణమును—కోటను—కుంగుటేళ్ళతోకూడా నేలమట్టము గావించెను. ఈతని నందనుడు-టిప్పుసుల్తాను. ఇతని తరువాత ఈ సీమ నిజాం వశము కాబడి కొంతకాలమునకు దత్తమండలములోకూడా—ఆంగ్లేయులకు -దత్తము కావింపబడెను. ఆ శ్వేతముఖుల పరిపాలనలో- నీ తాలూక- కొన్ని దినములు—కర్నూలు—కడప మండలములో చేర్చబడి—మరికొంతకాలమునకు నెల్లూరు మండలములో నుండెను. 1970 నుండి ప్రకాశము జిల్లాలో నున్నది. ఇది దారి తెన్నులేక కడకు యెత్తువారి చేటిబిడ్డయైనది

## కొండలు—బండలు

కనిగిరి కొండలు-బండలు చాల ప్రసిద్ధమైనవి. అందులో దుర్గము చారిత్రాత్మకముగ పరిశీలింపతగిన విశేషము లున్నవి. కాని శ్రమైక సాధ్యమైన పని. అయ్యుడుత్సాహము కలవారు వదలుట లేదు.

సామాన్య మానవులనుండి—అసామాన్యులైన మానవులవరకు ప్రత్యహమును—లోదుర్గము మీదనే జీవిక గడుపుచున్నారు. 'భాగ్యాయత్తం ఫలంపుంసాం' అన్నట్లుగ వారివారి అదృష్టాయత్తముగ ననేకములైన వస్తువు లప్పుడప్పుడు లభించుచుండినట్లు పరిసర జానపదులు బంగారు పలుకులు.

### బొగ్గుగొంది :

ఇది రెండువ్నర అడుగులుగల రాళ్ళతో నమర్చబడిన-ద్వారము — దీని ననుసరించి 3 అడుగుల వెడల్పుగల రాతి గోడ చాలదూరము

కట బడి యున్నది. ఈ గొంది మార్గముగనే దుర్గములోని ప్రవేసింపవలయును. ఇదంతయు కేవలము రాతికూర్పే కాని-సిమెంటుకాని, సున్నముకాని యుపయోగింపబడలేదు-ఆశ్చర్యకరమైన విషయము.

## చెన్నమ్మక్క బావి :

పై మార్గమున కొంత దవ్వరిగిన పిదప చతుర సాకారము కల ఈ దిగుడుబావి వచ్చును — దీనిని శ్రీకృష్ణదేవరాయల పట్టమహిషియైన-చిన్నాదేవి సర్వ జనోపయోగార్థముగ నిర్మింపచేసినదనియు-క్రమముగ మారుచు నేటికీ పేరు నిలచినదనియు పలువురనుచున్నారు. కృష్ణదేవరాయలు స్వాధీనమున కొంతకాల మీప్రాంతమున్నట్లు తెలియుచున్నది కదా ! ఇందలి నీరు లోదుర్గమున యాత్రాయాతజనంబుల కుపయోగపడుచున్నది. దీని పరిసరములలో కొన్ని భిన్నములైన విగ్రహములున్నవి. పోయినవి పోగా ఉన్నవాటిలో-చతుర్భుజుడ — శ్రీమహా విష్ణుమూర్తి. ఆయన వాయుభక్ష నిరాహారిగ నిలచి నింగినిచూచున్నాడు. ఆనాటి కోటలోనుండు దేవాలయములోని విగ్రహమేమో ? నేడు దేవాగార ప్రాంతము కాని — ఆ ఆనవాలుకాని లేదు.

దీని నానుకొని — (నేటి వ్యవహారము) మందులకొట్టున్నది. 4 8= మూరల వైశాల్యముగలదీకొట్టు. ఇందు నేడు ముండ్ల పందులు నివసించుచున్నవి. అట్లు కొంతదూరము పో భీముని పాదమట-అడుగు ఆకారముగల గుంట యున్నది. పెద్ద చిన్న గుంటలు వాటిలో పానయోగ్యమైన నీరుండును. పెద్ద పెద్ద గుహలు-వాటిలో చిఱుతలు — ముండ్లపందులు — నివసించుచుండు — భయంకరముగనుండును-ప్రకృతి రామణీయకరముగ నుండును-మనుష్యసహాయము లేనిది పోజాలము.

## వింతలు—విశేషాలు

కొన్ని రోజులకుం బూర్వము — కట్టెలు కొట్టుకొనుటకు వెళ్ళిన—మహమ్మదీయ వనితకు-ఒక వృక్షముకడ — పురుగులమాదిరి కనుపడగ- అదేమో వింతగ చేయిపెట్టినదట క్రమముగ — బంగారు కణికలుగ మారినవట—అది చూచువరకు చోద్యముగ నుండెనట — అవి డైమన్ ఆకారముతోనుండి—ఒకవైపు పుష్పము గుర్తును, రెండవవైపు — చంద్రవంక గుర్తును కలిగి అర అంగుళం ప్రమాణములో నుండినవట. ఇంకను మధ్య మధ్య చాల వస్తువులు దొరికినట్లు జనశ్రుతి. ఆ దొరకిన బంగారం ఇప్పుడు లేదు రూపుమారి పోయినది.

నాల్గు మాసములనాడు — సువర్ణాన్వేషణకై బయలుదేరిన యువకబృందము ఆ లోయలోపోగా కొంత దూరమువ—త్రవ్వకము

## శా స న ము

ప్ర తా ప
పి హ్మ పి పా దా
ల ధ న ము
స లు రు చ్ఛ ము త త
వ్వి వా ను వచ్చము
ద్ద ల రా టి భా యి
పా రు - గ ం గ
రి ం లా బా
ఉ ం ర ం త
న ం ది పు న్న ది
టి వి ర రి ం ది ం
తొ ం డా ర న ం
గా జ ర వ ది న
దా దే న ం బా వు స ం దు
బ రు ల గా డు ర ం
యి పు న ం బు
ది న చా రు.

ఉన్నది ఉన్నట్లే కాపీ చేయబడినది.

---

ప్రారంభము చేయగా — అక్కడ - ఓ రాతిమీద - ఈ శాసనమున్నది — అద్దానిని ప్రక్కకు పడవేయుగా దాని క్రింద నాల్గడుగుల లోతులో —



ఆకారముకల కత్తి లభించినది. '9' (౯) అంగుళములు పొడవు కలిగి—చూడని వార్కి చూచుటకు భయముగ నున్నది ఇద్దాని నెంత పరిశీలించినను నా యల్ప మతికి ఏమియు పాలుపోలేదు — కాలమును తెలియలేదు పిడికి. ఇత్తడిలో భేతాళాకారముగల బొమ్మకలదు — క్రింద ఖనుమును రాగిలో తాపడము చేయబడియున్నది. వస్తు

వింత కాలముగ భూమిలో నున్నను త్రుప్పుపట్టలేదు — త్రుప్పుపట్ట కుండుటకు — ఈ ప్రక్రియ న ప్రాచీను లుపయోగించెడి వారట — బహ్మానాస్త్రపునందు.

కాష్టిలా రక్షయా యుక్త మదితె తప్తమాయసమ్ ।
క్షిప్తమే కదినం భంగమాప్నోతి న శిలాదిషు ॥—

అందువలననో యనునట్లు, వస్తువింతయైనను చెడలేదు సరికదా! గుణమైనను కగ్గలేదు — పరిశీలకులీ వింత వస్తువును పరిశీలింప ప్రార్థన. నాకడ భద్రపరుపడి యున్నది.

ఈ ప్రదేశమున కించు కంతదూరమున — ఒక స్త్రీ విగ్రహ మున్నదట. అద్దాని మెడలో రాతి కంఠ హారమున్నదట. కదలుతుంది కాని—ఎంత యత్నించినను అది వదలిరాదు — అద్దాని కేమికారణమో తెలియదు—దాని క్రింద ఏమైనా యుండునేమోఅని — ఈ యువక బృందము ఆలోచన. అది ఏమైన సంకేతముండునాయని నాయూహ. ఆ ప్రక్కనుండు — శాసనమును పరిశీలించి — దీని సంకేతము అర్థ మగునేమోయని నాయూహ!'

ఇంక నచ్చో కొలఁది దూరముపోయినచో — రాజభవనములు పాడుపడిన ప్రాంతమున్నదఁట. ఆనాటి శిలాదారు లోహ వస్తువులు — దొరకనచ్చునని — కన్నవారి — విన్నవారియూహాపోహలు.



## రాతిలో కత్తి :

ఒక కొండపై చతురస్రముగ నున్న రాతిలో ఒక కత్తి యున్నదట-అది (½) అరంగుళము మాత్రము పైకి కనుపడునట— ఆ అగ్రభాగమునుపట్టి యత్న పూర్వకముగా పైకి దీయ షుమారు నాల్గంగుళములు పైకి వచ్చి జారిపడుచు — ఘల్లను ధ్వనితో పడి పోవునట—అందులకేమైన—సంకేతముండు నాయని యూహలు.

ఇంకను అనేకులకు అనేక వస్తువులు లభించినవందురు. అట్టి అపూర్వమైన వస్తువులను-పురావస్తుతత్త్వవేత్తలు-ప్రతిఫలమిచ్చి యైనను—గ్రహించి భద్రపరచవలసినదిగా నా ప్రార్థన.

కనిగిరిలో దుర్గమునకు పోవుమార్గములో ఒక కాలువయున్నది. అందొక శాసనము పడవేయఁబడియున్నది—అందలి లిపి తెలుగు—కాని ఆ సంకేతాక్షరములవగతమగుటలేదు.

## సింగరప్ప దేవాలయము

ఈ సిగ్గ పురుషు డెవ్వడో తెలియదు. ఈ యాలయ నిర్మా ణమున కుపయోగించిన బండలు 3 అడుగుల మందము కలిగి — అంతే లావు కలిగియున్నవి. ఆ దేవాలయమునకు ప్రక్కననే — కాశి ద్వారమున్నది. ఈ పర్వతమంతయు పెద్ద శివలింగ ఆకారమున నున్నది. ఇదొక గుహలో దక్షిణాభిముఖుడుగ మార్కాండేశ్వరు డున్నాడు దక్షిణాభిముఖముగ.ఈశ్వరదేవాలయముంట అరుదుగదా! ఈ పరమేశ్వరునిని — మార్కండేయ మహర్షి ప్రతిష్ఠించెనని చెప్పు చున్నారు.

కనిగిరికి సంబంధించిన — శాసనాలు నెల్లూరు జిల్లాశాసన సంపుటములో 40 వరకున్నవి. లోదుర్గమును పరిశోధించిన — వినూత్నాంశము లెన్నియో వెలువడునని-నాయూహ. నాకు తెలిసిన ఈ నాల్గు మాటలను లోకమునకు వెల్లడించితిని. పురావస్తు తత్త్వ వేత్తలు—వెలుగుకు తీయుదురుగాక —

—విద్వాన్ శ్రీ కొమాండూరి రామానుజాచార్యులు.

## ఆంధ్ర సాహిత్య చరిత్ర

ఉత్తమదేశికుఁడు, మహాకవి, శిష్యవిమర్శ ప్రవర్తకుఁడునైన పింగళి లక్ష్మీ కాంతముగారు "ఆంధ్రసాహిత్య చరిత్ర" రచించిరి. అది వారిమరణానంతరము ఆంధ్రసాహిత్య—అకాడమీవారు ముద్రింపఁగా వెలుఁగు చూచెను. ప్రథమ ముద్రణప్రతులచిరకాలముననే చెల్లి పోయెను. ఆంధ్రసాహిత్య—అకాడమీవారే తిరిగిదానిని ముద్రింప నిర్ణ యించి రని వింటిని.

విధివశమున లక్ష్మీకాంతముగారు సమగ్ర సుందరమైన యాంధ్రసాహిత్య చరిత్రను వ్రాయలేకపోయిరి. వారు రచించిన గ్రంథము శ్రీనాథయుగముదాఁక విపులముగా నున్నది. శ్రీకృష్ణ దేవరాయలయుగమునకు నేపథ్య మనఁదగిన సంగ్రహ రాజకీయ చరి త్రతో ముగియు చున్నది.

లక్ష్మీకాంతముగారు "ఆంధ్రసాహిత్య చరిత్ర"లో వెల్లడించిన కొన్ని యభిప్రాయములు సహృదయుల పునః పరిశీలమునకు పర్హమగు చున్నవి. వారు 53 వ పుటలో "నన్నయ శైలి — భాష — ఆత్మీ యత" యను నుపశీర్షిక క్రింద నిట్లు వ్రాసిరి:

"శైలి యనుపదము భాషాపరముగ నే నెరిగిన ఏ అలంకార శాస్త్రములోను లేదు. ఇతరత్ర ఎచ్చటనైన ప్రయుక్తమై యున్న దేమో నే నెరుగను. దానికి శబ్ద నిష్పత్తినిబట్టి "శీలవంతుని భావ కర్మ" అని ఒక నిఘంటువులో నున్నది. ఈ నిర్వచనములో "శీల వంతుని" అనెడి విశేషవాచకమును సాధారణ వాచకముగా గ్రహించి నచో మానవుని భావకర్మ అని యర మగును. భావకర్మ అనగా మానవుడు శారీరకముగా గాక మానసికముగా చేసెడివ్యాపారము. కాగా శైలికి మానవుని మనోవ్యాపారము అని యర్థము వచ్చును. దానికే భావగతి యనిపేరు. ఆ భావమును శబ్దరూపమున వ్యక్తముచేయు నపుడు ఆ భావగతి శబ్దగతిగా రూపొంది ఆంగ్లమున Style అను పదము ఏ యర్థమున వాడబడుచున్నదో ఆ యర్థమునకు సరిపోవును. కావున కల్పితమైనను శైలియను పదము శాస్త్ర సమ్మతమే యగు నని నా తలంపు. ఇది బహుజనాంగీకృతమగుటచే విమర్శకులు ధారా ళముగా వాడుచుండిరి. ఆంగ్లమున సాహిత్య పరముగానే గాక ఆ పద మును తీరు, సరణి, రీతి మొదలగు ఇతరార్థములలోకూడ వాడు చుందురు."

లక్ష్మీకాంతముగారు చెప్పినట్లు "శైలి" యను పదముసాహిత్య ప్రపంచమున ధారాళముగా వాడుకకు వచ్చినట్టిదే. అది రచనా విధా నము అను నర్థమున నధికముగా నుపయోగింపఁబడుచున్నట్టిదే. ఇందు సందేహమునకుఁ దావేలేదు. మఱి "శైలి" యనునది కల్పిత పదమని లక్ష్మీకాంతముగారనిరి. కాని యే పదమునుండి యది యవ తరించినదో వారు స్పష్టము చేయరైరి. Style అను నాంగ్లభాషా పదమునుండియే "శైలి" యేర్పడినదని లక్ష్మీ కాంతముగారి యభి ప్రాయమా ? "కావున కల్పితమైనను శైలియను పదము" అను వారి మాటలను సందర్భమునుబట్టి విద్వాంసులే యర్థమునుజెప్ప కొనవలయును ?

సంస్కృతాంధ్ర వాఙ్మయములయందు "శైలి"యను పదము గోచరించు చున్నది. మనుస్మృతి వ్యాఖ్యానము (1 అ. 4 శ్లో) చేసిన కుల్లూకభట్టు

"ప్రాయే ణాచార్యాణా మియం శైలీ య త్స్వాభిప్రాయ మపి పరోపదేశ మివ వర్ణయంతి"

యని శైలి పదమును వాడెను.

శ్రీనాధుడు.శృంగార నైషధము (ఆశ్వా 7. పద్య 157) నం దీ పదమును వాడెను.

టంక ముఖంబులన్ మణివిటంకములన్ లిఖియించియున్న మీ
నాంక రస ప్రసంగ మధు రాదిమ గాధలు, పారదారికా
హంకరణ క్రియా సమభిహార మహోపరిహాస సంకథా
సంకలితంబు లొప్పెదవు శైలిఁ బఠింతురు ప్రౌఢభామినుల్

ఇట యొప్పెదవు శైలి ననుదానికి వేదము వేంకటరాయశాస్త్రిగారు "మనోహర ప్రకారమున" నని యర్థము వ్రాసిరి.

బ్రౌనుదొరగారు, సీతారామాచార్యులవారు 'శైలి' పదమును దమ నిఘంటువులలోఁ జూపరైరి. కాని మామిడి వేంకటార్యులు రచించిన "ఆంధ్రదీపిక" లో నీ పదము కలదు. మఱి సూర్యా రాయాంధ్ర నిఘంటువులోను గలదు. ఆంధ్ర దీపిక యీ పదము నకు "సంకేతము, పరిభాష; శాస్త్రీయ వ్యవహారము" అను నర్థము లిచ్చెను. సూర్యారాయాంధ్ర నిఘంటువు దీనిని ఈకారాంత స్త్రీ లింగ విశేష్యముగా స్వీకరించి "1. వ్యాకరణ సూత్రముల సంక్షిప్త వివరణము 2. అర్థము చెప్పెడి పద్ధతి. మొదట సామాన్యముగా నర్థము చెప్పి పిమ్మట దానిని విస్తరించి వివరించుట 3. నడవడి, ప్రవర్తనము 4. రచనారీతి" యను నర్థములు నిర్ణయించెను. ఈ రెండు నిఘంటువు లిచ్చిన యర్థములకు ప్రయోగములు చూపలేదు.

సూర్యారాయాంధ్ర నిఘంటువు శైలీ పదమునకు "రచనా రీతి" యను నర్థము చెప్పుటకు హేతువు సాహితీ ప్రపంచ వ్యవహార బలమే. శ్రీనాధుని ప్రయోగమునుబట్టి యీపదమునకు "వ్యక్తీ కరణ విధాన" మను నర్థమును నిర్ణయింపఁదగును. అప్పుడది సామాన్యవాచి. కాని కాలము గడచినకొలఁది విశేష వాచియై సాహిత్య ప్రపంచమున రచనారీతియను నర్థమున రూఢికెక్కెను. Style అను పదమునుండి శైలి యవతరించినదని యనుకొనుటకు సాక్ష్యము నన్వేషింపవలయును.

లక్ష్మీకాంతముగారు నాచన సోముని ఉత్తరహరివంశము దురవ బోధమై, యప్రసన్నతా దోషముపాలఁ బడుటకు నొక కొన్ని కారణ ములు చూపిరి (పొరట 335) వారు చూపిన కారణములలో నొకటి సోముఁడు "అపూర్వములైన ఉపమలు, అర్థాంతరన్యాసములు ప్రయోగించుట." సోముని యర్థాంతరన్యాసములనుగూర్చి లక్ష్మీ కాంతముగా రిట్లు వ్రాసిరి. (పొరట 336).

"చేలపంటలఁ గొయ్యలు చెప్పఁగావె? ఇదియొక యర్థాంతర న్యాసము. పండిన చేను కోసిన తరువాత నేలమీద మిగిలిన మొదలి భాగములను "కొయ్యలు" అని రాయలసీమ ప్రాంతమువారందురు. కోస్తాప్రాంతమువారు వాటిని "మోడులు" అందురు. చేను బాగుగా పండిన మోడు లావుగా నుండుటయు, పండనిచో మోడు సన్నగా నుండుటయు సహజమే. జానపద జీవితమునుండి ఈ యర్థాంతర న్యాసమునకు తగిన సామగ్రిని గైకొనుట చాల సొగసుగా నున్నది. ఏని ఆ వాక్యార్థము మండలాంతర వాసులకు అర్థముకాదు. ఇటు

వంటివే గాక ఈమాత్రమె వను అర్థముగానికి పెక్కులు గలవు"

లక్ష్మీకాంతముగారు పొరపడిరి. వారు ఉ పిన యర్థాంతర న్యాసము సోముని యుత్తరహరి వంశము నందలిది గాదు. మఱియది శ్రీనాధుని కాశీఖండమునందలిది. కాశీఖండ సప్తమాశ్వాసమునందు వ్యాస నిష్కాసన కథ కలదు వ్యాసుఁడు భిక్షలభింపక కాశిని శపింప, దలఁచుటయు, నంత ప్రాకృత స్త్రీ వేషధారిణియగు పార్వతి యా మహర్షికి నాతని శిష్యులకుఁ గంఠదఘ్నముగా భోజనము పెట్టుటయుఁ, బిదప రు దుండు వ్యాసుని నదిక్షేపించి కాశిని విడిచి పొమ్మనుటయు, ఆ తపస్వి శిష్యులతోపాటు "కాశికాపురి కెడదవ్వు కలుగు నడవి" వసించుటయుఁ నత్కథాపుట్టములు భిక్షాన్నము వడయనేరని కృష్ణ ద్వైపాయనుఁడు మఠము నకు వెళ్లి "జఠర క్షుధా వ్యథాదురు మాన మానసుండై" శిష్యులను రావించి పలికిన పలుకులలో నీ క్రింది పద్యమొకటి.

తే॥ గీ॥ వాడఁ బాఱినయాని వక్త్ర వనరుహములు
భాజనంబుల లోన నిప్పచ్చరంబు
మీకు భిక్షాన్నములు లేమి నాకుఁదెలిసెఁ
జేల పంటలఁ గొయ్యలు చెప్పఁగావె.

1908 వ సం॥లో వంకాయల కృష్ణస్వామి సెట్టి గారు ముద్రించిన కాశీ ఖండమున "చేలపంటలు గొయ్యలె చెప్పగాదె" యని యున్నది. పై పద్యము వావిళ్లవారి ప్రతియందలిది.

— శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

# లేఖలు

జూలై 'భారతి' సంచికలో 'కలగూరగంప' శీర్షికలో వెలువడిన 'కలువకొలను' వ్యాసములో చిన్నపొరబాటు దొర్లినది. రచయితలు 'త్యాగరాజుగారు వాతాపిగణపతిని, బాపిరాజుగారు లేపాక్షి బసవని మాత్రమే జూచిరి గాని వానివలె స్తుతిపాత్రమైన గణపతిమూర్తులు, నందీశ్వరమూర్తులు ఈ ప్రాంతమున పెక్కులున్నవి' అని పేర్కొనినారు (పుట 51). వాతాపి గణపతిని త్యాగరాజు ప్రశంసించలేదు; ప్రసిద్ధమైన హంసధ్వని రాగకృతి అయిన 'వాతాపి గణపతిం' రచయిత - సంగీత త్రిమూర్తులలో ఒకరుగా ఎన్నికగన్న ముత్తుస్వామి దీక్షితర్. కనుక 'కలువకొలను' వ్యాసమున త్యాగరాజు ప్రసక్తి అసంబద్ధము.

— శ్రీ పి ఎస్ గోపాలకృష్ణ

* * *

జూన్ 76 భారతి మాసపత్రికలో 5వ పేజీలో సాహిత్య వ్యాప్తి : పరిణామాల పరిరక్షణ అను వ్యాసమును చదివిన పిదప ఇలా వాయాల్సి వచ్చింది. సాహితీ పిపాసువులకు ఇది ఎంతో విలువైన వ్యాసం

కాని 6వ పేజి మొదటి కాలంలో చివఱ "ఇక సర్వమూ రసదృష్టితో చూచిన జగన్నాథ పండితుడు "వాక్యంరసాత్మకం కావ్యం"-రసాత్మకమైన వాక్యమే కావ్యం—అని నిర్వచించారు." అని వ్రాశారు శ్రీ తిరుమల రామచంద్రగారు "వాక్యం రసాత్మకం కావ్యం" అనులక్షణమును సాహిత్య దర్పణకారుడు విశ్వనాథుఁడు చెప్పెను ఆ లక్షణమును ఖండించిన జగన్నాథ పండితరాయలు "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం" అని కావ్యమును నిర్వచించెను మరి ఈ పొరపాటెట్లు దొర్లినదో తెలియదు పెద్దలు మరియు సాహితీ వేత్తలైన శ్రీ తిరుమల రామచంద్రగారు ఇటువంటి సాహితి వ్యాసంలో తప్పులు దొరలించుట సమంజసం కాజాలదు ఇందు రసదృష్టితో చూచిన విశ్వనాధుడు అనుటకు బదులు జగన్నాథుడు అనుపొరపాటు పడియుండ వచ్చును.

— శ్రీ కే రామ చార్యులు

రాజమహేంద్రవరము తాలూకా "కోరుకొండ"లోని పరాశర గిరికి వెనుకనున్న "కాపవరం కేవ్సు"గా చరిత్రలో రికార్డు కాబడియున్న "పాండవుల మెట్ట"గా పిలువబడెడి పర్వతములోని గుహలు బౌద్ధ గుహలా? గిరిదుర్గమా?

ప్రాచీన కాలమున ఆంధ్రదేశమున బౌద్ధభిక్షువుల నివాసమునకును సభాసమావేశములకును కొండలుదొల్చి గుహలు, గుహావిహారములు "శంఖవరము-కోరుకొండ-ఎట్టుఁ పాలెము" మున్నగుచోట్ల నిర్మింపబడినట్లు చరిత్ర కారులు నుడువుచున్నారు.

కాని కోరుకొండకు ప్రక్కగానున్న కాపవరం గుహలలో ఎట్టి బౌద్ధచిహ్నములు కన్పట వు. పర్వతమునకు మధ్యగా పర్వతము దొలువబడి వరుసగా తొమ్మిది గదులును—గదులకు కిటికీలును ముందు చిన్ని వసారాయు గలవు. గదులలో స్తూపాదులు లేవు.

పర్వతముపైన నేలమట్టమయి కొన్ని రాతి పునాదులు—ఇటుక పునాదులు కన్పట్టుచున్నవి. బౌద్ధవిహారమునకు సంబంధించినవని చెప్పుటకు మరి యెట్టి చిహ్నములు కన్పట్టవు.

కోరుకొండ గిరిదుర్గముగా 8వ శతాబ్దమునుండి మిలటరీ క్యాంపులున్నట్లుగా చరిత్రలు చెప్పుచున్నవి. ఈ ప్రాంతమున ఇంత విశాలమైన పెద్ద పర్వతము మరియొకటి లేదు.

ఇదియే గిరిదుర్గమనియు—ఇపుడు శిధిలమయి కన్పట్టు పునా

దులు కోటలోని బురుజులు మున్నగువాని శిథిలములా యని యనుమానము కలుగుచున్నది.

ముమ్మడి నాయకుని శాసనము:

శ్లో॥ పాణర - కోన కురవాటక చెంగరాదీన్
గోదావరీ ముభయతోయ ముపాంతదేశాన్
జిత్వావనాచల జలస్థల దుర్గ రమ్యా
నేకః ప్రశాస్తి చిరమ ప్రతిశాసనం సం॥

అని చెప్పుచున్నది.

పాణర. కోన, కురవాట, చెంగర సీమలను.

వన, అచల, జల, స్థలదుర్గములుగా పాలించినట్లు క్రమాన్వయము వచ్చుచున్నది.

కోరుకొండలోని ప్రతాపరుద్రుని శాసనములో గోదావరి తూర్పున, కోనమాడలు అని ప్రయోగించినాడు ఈ శాసనమువలన ఈ ప్రాంతమునకు "కోన" యను నామమున్నట్లు వెల్లడి యగుచున్నది.

ముమ్మడి నాయకుని శాసనము కోన ప్రాంతమును అచల (గిరి) దుర్గముగా వర్ణించుచున్నది. దీనికి ప్రమాణముగా నిప్పటికిని ఈ గిరిని చేరియే మట్టికోట గోడలు కలదు పై ఆధారములనుబట్టి పాండవుల మెట్టపైగల గుహలు బౌద్ధగుహలుగాక గూఢచారులు నివసించుచు శత్రుచర్యలను కనిపెట్టు స్థావరములుగా భావింపవచ్చును. పర్వతమున గుహలుగల ప్రాంతమునకు చేరుకొన్నగాని గుహలు కనపట్టవు. కాని కోరుకొండనుండి రాజమహేంద్రవరమునకు మధ్యగల ప్రాంతమునంతయు పరిశీలించుట కవకాశము గలదు. క్రిందినుండి గుహలుగల ప్రాంతమునకు సైనిక విషయమున ఎట్టి ప్రతిఘటన చేయలేరు గాని పైనుండి క్రిందకు సూటిగా ఎట్టి ఆయుధములు ప్రయోగించుటకైనను అవకాశము గలదు గుమ్మమునకు ప్రక్కగానున్న కన్నములనుండి ఆయుధములు ప్రయోగింపవచ్చును.

పై విషయము లన్నియు పరిశీలించిన ఇవి గిరి దుర్గమునకు సంబంధించిన గుహలే గాని బౌద్ధగుహలు కావని సుస్పష్టమగును,

చరిత్రకారులు, విమర్శకులు, పై విషయములను పరిశీలించి. చారిత్రకాధారములను మాకు తెలియజేసి మా చరిత్ర పరిశోధన కృషిలో తోడ్పడవలసినదిగా ప్రార్థించుచున్నాను.

— శ్రీ గుండు విశ్వేశ్వర శాస్త్రి



# గ్రంథ విమర్శలు

## చంద్రసేన (నాటకం)

[రచన: శ్రీ అంగర-సూర్యారావు, డెమ్మీసైజున చిన్న అచ్చులో 86 పేజీలు. వెల: 5 రూ. ప్రచురణ — రంగశాల, 22-67-5 చోపుదారుగల్లీ, విశాఖపట్నం-530001.]

శూద్రకమహాకవి పెట్టిన ఒరవడిలో ఈ నాటకాన్ని రచించినట్లు రచయిత చెప్పుకుంటున్నారు. శూద్రకమహాకవి సంస్కృతంలో రచించిన మృచ్ఛకటికంలో ఆర్యకుడు పాలకప్రభువుపై తిరుగుబాటు చేసి, తన అనుచరుల సహాయంతో ప్రజలను పీడిస్తున్న రాజును పదభ్రష్టుని చేసిన వృత్తాంతం చిత్రించబడింది. ఆ రీతినే ఇందులోనూ జయంతుడు మున్నగువారు శూరసేనరాజును ప్రభుత్వం నుంచి తొలగించి ప్రజారాజ్యాన్ని స్థాపించడం వివరించబడింది. అందులో వసంతసేన ఉండగా ఇందులో చంద్రసేన ఉన్నది. వసంతసేనకు రాజకీయాలతో ప్రమేయం లేదు. కాని ఇందులో చంద్రసేన వాటిలో ప్రముఖ పాత్రను వహిస్తుంది. అవినీతి ప్రవర్తన, లంచగొండితనం, మానభంగం, బీదల హింసలు మున్నగునవి ప్రజల తిరుగుబాటునకు కారణంగా ఇందులో ప్రతిపాదించబడినవి.

రచయిత ఈ నాటకాన్ని రంగస్థలంమీద ప్రదర్శించి, చూచి, ప్రదర్శన విజయవంతమైన తరువాత దీన్ని ప్రచురిస్తున్నట్లు సూర్యారావుగారు వ్రాస్తున్నారు.

86 పేజీల పుస్తకంలో రెండే రంగాలు. మొదటిరంగమే ఏభైయేడు పుటలు. దండుని బందిపోటు, రణధీరుని దౌర్జన్యం, లంచగొండితనం, జయంతుని తిరుగుబాటు, ధనపతి దురాగతం, భద్రభట్టారకుల అమానుష చర్యలు, శూరసేనుని పరాధీనత వర్ణించబడినవి. రెండవ రంగంలో తిరుగుబాటుదారుల తంత్రాలు, వాని సత్ఫలితాలు, ప్రజాస్వామ్యం ప్రదర్శించబడినవి.

ఇందులో కొన్ని సంఘటనలు అస్వాభావికంగా కానవస్తున్నవి. కుంతల నగరానికి ప్రక్కన సముద్రమున్నట్లు ఇందులో చెప్పబడింది. అది సముద్రతీర ప్రాంతంకాదు. రాజధానికీ, విలాసభవనానికీ మధ్య కొండలూ, లోయలూ ఉన్నట్లు వ్రాయబడింది. అక్కడే అరాచకాలూ, హత్యలూ, తిరుగుబాట్లూ జరుగుతూ ఉంటాయి. రాజుగారు విలాసభవనాన్ని అంతదూరంలో ఎందుకు కట్టించారో, ఆ భవనానికి ధనపేటికను ఎందుకు పంపవలసి వచ్చిందో తెలియడం లేదు.

ఇట్టి సందేహాలు సామాన్య పాఠకుడికే కలుగుతూ ఉంటాయి. అయినా ప్రదర్శకుల నైపుణ్యంవల్ల ఆ లోపాలు కానరాకుండా పోవచ్చునేమో ! రంగాల సంఖ్యను పెంచి దృశ్యాలను ఎక్కువచేస్తే ఇది ఇంకా రసవంతంగా తయారయ్యేదేమో !

ఈ దృశ్య రచనలో నాటకకర్త ఆశయం మెచ్చుకోదగినది.

—"అంగీరస"

## కొప్పరపు సోదరకవులు పూరించిన కొన్ని సమస్యలు

[ముద్రాపయిత: శ్రీ కుంటముక్కల వెంకట జానకిరామ శర్మ, పెనుగుదురుపాడు, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా, క్రౌనుసైజు 18 పుటలు. వెల రూపాయి. ప్రతులకు ముద్రాపకులకు వ్రాయవలెను.]

ఈ శతాబ్ది ప్రారంభంలో శతావధానాలకూ, అష్టావధానాలకూ, ఆశుకవితకూ ఎక్కువ ప్రచారమూ, గౌరవమూ ఉండేవి. ఆ అవధానాలు చేసేవారిలో తిరుపతి వెంకట కవులూ, కొప్పరపు సోదరకవులు ప్రఖ్యాతి చెందారు. వీరు ప్రతి స్పర్ధులు. ఆ స్పర్ధ వల్లకూడా అవధానాలు ఎక్కువ ప్రచారానికి వచ్చాయి. కొప్పరపు కవులు ఆ యా సందర్భాల్లో పూరించిన సమస్యలు కొన్ని ఈ చిన్న పుస్తకంలో ఇవ్వబడినవి.

వెంకట జానకిరామశర్మగారు ఇదివరలో వదాన్యుల విరాళాలతో ఆ సోదర కవుల శతావధానాలను రెండుభాగాలను ప్రకటించారు. ఆ సోదర కవుల జీవితచరిత్రను నిడుదవోలు వేంకటరావుగారిచేత రచింపజేసి ప్రకటించారు. మరుగుపడిపోతూ వున్న వారి సమస్యాపూరణాలను ఇప్పుడు ఉప్పులూరి-గోపాలకృష్ణశర్మ, యల్లంరాజు-సూర్యనారాయణరావు, సంకా-వెంకటేశ్వర్లుగుప్తగార్ల ధన సహాయంతో ఇది ముద్రించబడింది. ఇందులో 75 సమస్యాపూరణములు ఉన్నవి. మచ్చునకు —

సమస్య — 'శనికిన్ భయమందవట్టె చతురుం డితండె!'

క. వనజాక్షు బహిఃప్రాణం
బనఁదగు విజయుం డితండె యమశేంద్రవపం
బును వహ్ని కిచ్చె యుగ్రా
శనికిన్ భయ మందవట్టె చతురుం డితఁడే!

సమస్య — 'కరోమి-కవయామి-వయామి-యామి' అను పదములు వచ్చునట్లు విష్ణుస్తవము.

మ. గరిమన్నిల్ప <u>కరోమి</u>టాదివలెఁ గు
ల్కన్ సాగె దుర్మేధ ధీ
వర హృత్స్వాం <u>కవయామి</u>కుండు శఁ డో
వం జూపినట్లయ బో
ధ రహింపం గను దే<u>వయామి</u>డిని బొం
దం జేయకే యొందు శ్రీ
ధర! <u>యామి</u> వ్యధి పాసయేశ! సురవం
ద్యా! కృష్ణ! భక్తావనా!

ఈ సమస్యా పూరణములవల్ల కొప్పరపు సోదరకవుల ప్రతిభా పాండిత్యాలు, సమయస్ఫూర్తి వ్యక్తం కాగలవు. ఆ సోదరకవుల పాండిత్యాదులను ప్రశంసించిన పెద్దలపేర్లు చివరి నాల్గు పుటలలో ఉన్నవి. వారిలో జయంతి రామయ్యపంతులు, తేవప్పెరుమాళ్లయ్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, చెన్నాప్రగడ భానుమూర్తిపంతులు, కావ్యకంఠ గణపతిశాస్త్రి, కే. వి. లక్ష్మణరావు, కొక్కొండ వేంకటరత్నం పంతులు, వేదం వేంకటరాయశాస్త్రి మున్నగు మహనీయుల పేర్లు ఈయబడినవి,

*— శ్రీ బులుసు వేంకటరమణయ్య*

## నిశ్శబ్ద తరంగాలు:

[ఎల్లోరాకవిత. డెమ్మి 1/8 160 పేజీలు, వెల రు 6/- ప్రతులకు : శ్రీనివాస పబ్లికేషన్సు, 63, వెంకటరంగంపిళ్లె వీధి; మదరాసు-600005.]

ఎల్లోరా అనేక రచనలు గావించి, పేరెన్నికగన్న ఆధునిక కవి గణంలో చేరినవారు; అయినా ఆయన వ్రాసినదంతా మేలిమి గుణం గలది అనలేము, ఇది సహజమే! ఛందం సంకెలలు అనుకొనే యీ వెగ వారు, అది అవసరము—సులభసాధ్యము అనుకొనే ఇంకొక కోవవారు వివాదపడరాదు...ఏది ఇష్టమున్నవారు అది చదువుకొంటారు ఆ తర్వాత భవిష్యత్తే వీటి వెల తీర్పరి కాగలదు. "నిజాన్ని కాలం నిర్ణయిస్తుంది" అని ఈ రచయితే అంటున్నారు.

"వచన కవితాప్రక్రియ" అనే శీర్షికక్రింద ఎల్లోరా చాలా విషయాలు చెప్పినారు: "ఏ కావ్యం సమాజధర్మాన్ని, యుగధర్మాన్ని ప్రతిఫలిస్తుందో, ప్రబోధిస్తుందో ఆ మహాకావ్యం ఆ కవిత ఆ కవి ఆయుగానికి అవార్యత్వం వహిస్తారు"—ఇది నిండు నిజంకాదు; యుగధర్మాలు మారుతుంటవి కాబట్టి అన్ని యుగాలకు పనికివచ్చే శాశ్వత రచనే సర్వజనీనమైన మహాకవిత. వాల్మీకి కాళిదాసాదులు ఆ శ్రేణి వారు. తాత్కాలిక సమస్యలు చేపట్టినవారు అప్పటి కప్పటికే పనికి వచ్చేవారు. ఆనాటి భావకవిత్వంపోయి ఇప్పుడు ఆకటి మంటల ఆవేశ కవిత్వం వచ్చి ఉన్నదిగదా. కాబట్టే ఎల్లోరా "ప్రస్తుతం సాహిత్యంలో కమిట్‌మెంటుకు ప్రాధాన్యం కనిపిస్తున్నది" అన్నది నిజమైనమాట. ఇది నేడు అతి అయిపోయి వెగటుపుట్టించి మొగం మొత్తుతున్నది. కడుపులో చల్ల కదలకుండా ఉద్యోగాలు చేసుకొనే వారే చాలమంది ఈ తెచ్చికోలు ఆవేశాన్ని దళితజన సౌభాగ్యకాంక్షను చూపుతున్నారు.

శ్రామికులు—సమసమాజం (రష్యాలో గూడలేదే!) ఈ వ్రాతల ప్రధాన విషయం. క్రిందివారిని పైకి దీయను చేతగాక పైవారిని క్రిందికి లాగనుంటారు. ఈ రచయిత ఇట్టి భావాలపట్లనే మొగ్గు చూపినారు. ప్రపంచం మరామత్తు గాకపోతే విశ్వరూపం చూపిస్తామని బెదరిస్తారు. ఇవి మేరల మీరిన మాటలు. ఇక వీరందరూ వ్రాసే విషయం ఒకటే అయినా, ఆ భావాలకు తొడిగేభాష—చెప్పే పద్ధతి కొందరిలో చాలా చోట్ల కవితా గుణ దీపకాలుగా ఉన్నందున చదివి ఆనందింపగలుగుతున్నాము.

కవిత్వానికి ఆవేశానికంటే ఆర్తే ప్రధానమంటారు—ఎల్లోరా. ఆర్తి ఆనందము రెండూ కలిగించేది ఆవేశాన్నే గదా! ఇక ఉన్నదంతా వాటిలోని విభేదమే. శ్రీనాథుడు రెండూ చవి జూపినాడు. కాళిదాసాదులు కక్కుర్తి పడినట్లు లేదు. కవి బాగా చెప్పగలిగితే నవరసాలూ పాఠకునికి ఆనందకరాలేగదా!

కవి ప్రజోద్యమాలలో పాల్గొనక పోవచ్చునుగాని, ఎల్లోరా పాల్గొనరాదని బయట ఉండే ప్రబోధించాలని, ఆదేశించడం-పరోపదేశ పాండిత్యం. గాంధీయుగంలో ఎందరో జాతీయగీతాకారులు జెయిళ్లలో సంకటిముద్దలు తిన్నారు; గరిమెళ్ల సత్యనారాయణ- "మాకొద్దీ తెల్లదొరతనం" అనే అమరగీతం వ్రాసింది కృష్ణాజన్మస్థానంలో మగ్గుతూనే. వీరందరూ ప్రబోధితులై ప్రభోదించి—చేసి చూపినారు.

ఎల్లోరా, నేడు గణుతికెక్కిన లోక కవులను చాలా మందిని పేర్కొంటూ (3, 4 చోట్ల) ఆ లిస్టులో తమ పేరూ దూర్చుకొంటారు. ఆత్మవిశ్వాసం అవసరమేగాని, వికటింపరాదుగదా. ఈ స్వకుచమర్దనం మంచి పేరుగాదు; ఇతరులు లేరా ఈ సంగతి చెప్పను? ఆ మహామహుడు —అజంతాను చెపుతూ, జతగా ఉండను (ఆ ప్రసిద్ధ గుహాలయాలవలె) ఎల్లోరాను చేర్చుకొన్నారేమో? కాబట్టే సహృదయంతో చేసిన విమర్శనలకు ఉలిక్కిపడి సమీక్షకులపై బడుతారు—ఈ కవి. ఏమి? ఈయన అంత కొంగ్రొత్తలు దిరిగిన వ్రాతకాడా? ఎవరేమి అనకూడదా? సమీక్షకులు సామర్థ్యంలో యీయనకు ఏమి తీసిపోరే!

ప్రజల నోళ్లలో నానే పదాలు, ముఖ్యంగా పల్లెలపదాలు చేవ ప్రాణం గలిగినవి, ఇప్పుడు అందరూ ఒప్పుకొంటున్న సంగతే. ఆ పద సేకరణ ప్రయత్నం ఇప్పుడు ముమ్మరంగా జరుగుతున్నది. తిక్కన. పోతన, శ్రీనాథాదులు మాండలీకాలనేవాడి భాషకు ప్రాణం పోసినారని విమర్శకులు అనేమాట. ఇప్పటి అభ్యుదయకవులు చాలామంది యీ పనికి పూనుకొన్నారని, ప్రతి సమీక్షలో ఎత్తిచూపి ఆనందిస్తున్నా – ప్రశంసిస్తున్నా కాని, అరాచకం దుష్ట ప్రయోగం స్పెలింగు తప్పులు, తప్పుడు అర్థాలు ఉండరాదనే నా మనవి. పల్లెటూరి వాడిని కాబట్టి నాకు వాటిపై మక్కువ ఎక్కువ.

ఎల్లోరా "తోటివాడు" అంటారు (10. పేజి) ఇది "తోడి" పదం. తెనుగులో తోటి అంటే పాకీ పనివాడే కాబట్టి, ఇది ఈయన నోట ఎంత నానినా, వాడి ఉండరాదు. కావలసినది శిష్ట వ్యావహారికం గాని, నింద్య గ్రామ్యంగాదు. "అప్పుడే అభ్యంగనం చేసిన యువతి కురులను సవరించుకొంటున్నట్లు" (34. పే) అంటారు; అభ్యంగనమంటే చమురుతో తల అంటుకోవడం గాని స్నానం చేయడంగాదే? వీటిని ఎవరైనా ఒక ఎలిమెంటరీస్కూలు టీచరు సమర్థించవస్తే-నోరు మూయించడంకాదు (ఇది ఎల్లోరా గారి మహాప్రయోగం) పళ్లూడగొటుతారు. "సుగంధాల పరిమళంగా మలచుకొని" (22) సుగంధాలు పరిమళాలు వేరా? రాతిలో విగ్రహాలను గదా మలచేది? ఈ దుష్ట ప్రయోగం చాలా ప్రచారంలో ఉన్నది; అయినా తప్పు తప్పే!" "కడుపునిండా నీళ్లు త్రాగి, పొట్టనిండా నీళ్లు నింపుకొని" (35) ఈ మహాకవి శరీర శాస్త్రం ఈ రెంటిని వేరుచేస్తున్నది. ఈయనలో పొగరు మాటలు మానితే కవిత్వం బాగుపడుతుంది.

ఇక రచనల సంగతి :– నిరాశకంటె ఆశాపూర్ణ భావాన్నే ఎక్కువగా చూపి ఒక ఆరోగ్యకర వాతావరణాన్ని సృష్టిస్తారు. కొన్ని చోట్ల మర్మకవిత్వ ఛాయలున్నవి. ఒక్కొక్కప్పుడు మాటల సందడిలో భావం బయట బడదు. ఈ పులుముడు లేకుండా వ్రాయ గలిగిన శక్తి ఈయనకు ఉన్నదే, యీ శైలి ఏల? పాతభావాలు కొత్త త్రోవన నడచి, అస్ఫుటమైన తెలుగునుడికారంలో కవితా శిల్పగుణం యీ రచనలలో చాలా చోట్ల వెలువరింపబడి ఉన్నది.

వాచవికి కొన్ని కమ్మటి ప్రయోగాలు:– పుడమితల్లి పురిటి నొప్పులు (22పే ) నీ పుట్టిన రోజున ఆశను బంగీచేసి పంపుతున్నా తల్లీ (25) ఈ దైన్య రసగుళిక మనసును ఊపి కరగిస్తున్నది. ఆశల కుటీరంలో కోర్కెలు రంగవల్లికలు వేస్తూంది (30) కలిమి లేములతో నిమిత్తంలేని గుసగుసల తోరణాలు (39) ఉగాదినాడు భిక్ష గాని చూచి వాపోవడం సహానుభూతి గుణం (41) తెనుగు అక్షరాల విందులతో సాహితీ సమారాధన (44) హృద్యమైన ప్రయోగం. మండలంపేర మాండలికంపేర అమ్మ గుండెలో మంటలు లేపకు (53) సమైక్యతను గూర్చిన మంచి నుడికారం. గడ్డిపూలు (62) భావం భాష చారుతరాలు. కాలపు ముళ్లకంపపై ఆరవేసిన జరీపంచ జీవితం (70)–గానుగెద్దులా బ్రతకడం (88) ఈ రెండు సూక్తులలో హృదయ సంస్కారాన్ని తెలిపే వేదాంత ధోరణి చిగురించి ఉన్నది. ఆకలి నాగరకతను పరీక్షిస్తుంది–అన్న సొంపు లొలికే నుడికారం నాగరతకు చక్కటి వ్యాఖ్యానం. చీకటి ఆఖరి శ్వాస విడుస్తున్న సమయం (86) మధురకవితా విలసనమైన వాక్యం. మనిషిమీద నమ్మకం ఉన్నదా రాళ్లకు చెవులు ముక్కులు చెక్కాను–అన్నది వేమనకవి ఎత్తిపొడుపుల ధోరణి. గాలివాన కూడబలుక్కొని (96) నాజూకైన గ్రామీణ ప్రయోగం.

ఇట్లా ఇంకా చాలాసన్నమల్లెలుగుబాళిస్తున్నవి; మూర్కొనండి.

## సుధాంశువులు

[ గద్యకవిత. మేకా సుధాకరరావుగారు; 1/8 డెమ్మీ; 120 పేజీలు; వెల: రు. 4/–; ప్రతులకు: గ్రంథకర్త; మేకావారి వీధి, పిఠాపురం–534450. ]

శ్రీ సుధాకరరావు సుధాంశువులనేగాని – అంటే – అమృత కిరణాలనేగాని నామ సామ్యంచేత సున్నపుచారలకు వెలువరించలేరు. ఈ కవి కుమారుడు–(కుమారుడో యౌవనుడో తెలియదు; ఉద్యోగి అనుటలో హాబీఅయిన ఈ రచనకు ఒక గౌరవం ఏర్పడుతున్నది) పరిణత చిత్తుడు. ఆధ్యాత్మిక నైతిక భావపూర్ణమైన దృష్టి యీ రచన భావాలను, శయ్యను పవిత్రీభూతం చేస్తున్నది. సంస్కృత చారు గంభీరత–తెనుగు తేనె తియ్యదనము – భావ పేశలత – సహజ ఉత్ప్రేక్ష–ప్రకృతికి శోభనిచ్చే ఉపమానాలు ఈ కవితా సంపుటి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. కాబట్టే వ్రాత భౌతికరాగ సంకిలముగాక ఉదాత్తను పొందినది. సమాజ వికాసము–జాతీయత–ఆత్మగౌరవం – ఈ కవి గానానికి పల్లవి–అనుపల్లవి.

ఇవి చిన్న ఖండికలైనా భావపూర్ణాలు; చెప్పటలో ఒక కొత్తదనమున్నది. పల్లెటూరు జానుతెనుగు ఈ కవితా లతాంగికి చందన చర్చ; ఉపమానాలు సర్వభూషలు. సామెతలు కొన్నిటిని సృష్టించినట్లున్నది; మరికొన్ని ఉన్నవే! ఇవే నుడికారానికి ప్రాణంపోసినవి. (నా పొట్ట సామెతల పుట్ట అనిగదా తెలిపినారు అనేది; కాబట్టే వీటి సంగతి నాకు బాగా తెలుసు.) చేపలుకొన్న సొమ్ముకు నీచు అంటదు అన్నది చూడండి ఎంతబాగున్నదో! తెనుగు – సంస్కృత

పదాలు కొత్తమారునబడి, కవితా శిల్పాన్ని విరియబూయిస్తున్నవి. విప్లవ కవులు ఇవి పాత చింతపండు అంటే వారి రుచి వారిది అనుకోవలసిందే.

ఈ పుస్తకం మూడుభాగాలుగా ఏర్పరుపబడినది.

## 1. భావస్వరాలు :

ఇందు – 'మార్పు'–ఉన్నదాన్ని విరుగగొట డంకాదని, సంస్కారాన్ని చూస్తారు (సంయోగం). జీవితం ఉయ్యాల అనడం ఆశాజ్యోతిని వెలిగించడమే–కాని, యీనాటి చాలామంది కవులవలె యీయన, జీవితాన్ని నిస్తేజపరచడంలేదని, సోమసుందరంగారి నిర్వచనం చెపుతున్నది. చిన్నతనంలో జ్ఞానబీజం నాటుకొని ఆచెట్టునీడ అనుభవించమన్నహితం, మరచిపోయిన సందేశాన్ని జ్ఞాపకంచేస్తున్నది. తేనెటీగలవలె వివిధ మకరందాలను ఒకే మధువుగా చేసినట్లు, ఒక్క మానవత్వమే నిలవాలని (నరనాకం) విశ్వమానవ సూత్రాన్ని చెప్తారు; వేమన "పూల వన్నెవేరు పూజ ఒకటే"అన్నట్లు. మత్స్యం–మానిని పోల్చడం సొగసైన కొత్తపోకడ. నీటిలో ఉన్నంతవరకు నీచు వాసనరాదు–అన్నది ఇంపైన ప్రయోగం. "కాపు లేనిదాని కాపురము జూడరా" అన్న వేమన భావానికి ఇది కొత్త తొడవు.

నీతి సూత్రాలతోబాటు, మంచి ఎత్తిపొడుపులు; విమర్శలో మార్గాంతరం చూపినారు. ఈ సందర్భంలో ప్రపద ప్రయోగం బిగిసి రచన నిలబడిపోయినది. "జీవితం ట్యాక్సీ వంటిది. నడచినా, నిలిచినా మీటరు నడచిపోతుంటుంది" అని, పాత భావాన్ని కొత్త మాటలలో పోతపోసినారు.

## 2. కవితాస్వనాలలో :

చిన్న ప్రాతలతో భావుకతను వెల్లడిస్తున్నారు. కవితా మహాత్మ్యం ప్రదర్శితమైన పట్టులలో రసస కళాపూర్ణంగా ఉన్నది. నేటి నవనాగరకతయొక్క భ్రష్టసంపాతాన్ని, నైట్‌క్లబ్బులు–క్యాబరాల నీతిమాలిన కృత్రిమ దృశ్యాలను వర్ణించి, విదిత సత్ సంప్రదాయాన్ని మేల్కొలుపుతున్నారు. నర్తకి విప్పిపారవేసిన చీర, బయట గుడిగోపురం చిత్రాలమీద పడివేయడం ఒక మంచి లబ్బు. సంధ్యాభావన ఒక రసవత్కరగులిక – భావం భాష ప్రౌఢాలై మంచిచెడ్డలు రెంటిలో ద్వైవత్వాన్ని చూస్తున్నది–సంస్కారిత కవిహృదయం.

## 3. జీవనరాగాలు :

ఇవి గోరంత కతలు. చిన్నవైనా, విషయగురుత్వంతో, ఈ కవి చెప్పినట్లే అద్భుతమైన కాగితానికి భారం భద్రంగా రుస్తున్నవి. ఇందు కథకపాండితి, వర్ణనావైభవం కరదీపికలు. ఈకథలు దుఃఖరస పూరితాలు; మానవుని ఎదుర్కొనే విషాదాల భిన్నముఖాలు ఇవి. ఇట్లా దుఃఖార్ణవ మగ్నులైన దీనుల వర్గాల ఉదాత్తపరమైన నీతిపాఠాలు చెపుతున్నవి. (రాగోదయం) – నీలాయనిగా ద్రౌపది పూర్వజన్మలో కుష్ఠరోగి భర్తకు చేసిన పరిచర్యను గమనానికి తెస్తూ, పశ్చాత్తాప పరితప్తమైన పతి చరిత్రను వెలుగొందజేస్తున్నది. (జీవనగోదావరి) – ప్రకృతే జ్ఞానోపదేష్ట అయి, మానవుని, జీవిత కాళరాత్రిలో ఆశారేఖల వెలిగిస్తున్నది. ఆకులూడ్చి, నననేస్తున్న అశ్వత్థం (రాగి) ఒక వికల మనస్కునికి నవ్యభావోదయం కలిగించడం ఒక ఔచిత్యం! బుద్ధభగవానునికి ఆ గయలో నీడలనిచ్చిన ఆ వనితపనస్పతి పాఠకుని ఎదుట నిలబడుతున్నది. ఇట్టి సూచనలేగదా కవితాగుణ రుచిర కోరకాలు! ఈ కవి మనసులోని చేతలకు అనుగుణంగా బాహ్య ప్రకృతిని వర్ణించడం మహాకవుల పోకడ.

"చిన్నతనం అంతా తన్ను భుజంమీద మోసిన తండ్రిని కన్ను మూసినాక తన భుజాన మోయవలసిన బాధ్యత కొడుకుది" (తిరుగు చెప్పని సత్యం) అన్న, భావం మనసును చకితం చేస్తున్నది

ఈ రచనలో ప్రతి పంక్తిలో - భాష భావంలో ఆకర్షణీయ గుణమున్నది. ఇప్పటికీ ఈ కవితాగుణ గౌరవానికి అమ్ముడుపోయి బ్రతుకుజీవులైనానేమో అనిపిస్తున్నది సంస్కృత నవ్య పదబంధాలు. జానుతెనుగు నుడికారపు తేనె చదువరికి ఇంతకంటె ఎక్కువగా అందివ్వడం కానిపని; చదవండి.

బంగారు సంకెళ్ళు అనుకోకుండా, యీ వాటను ఛందోబద్ధం చేసిఉంటే ఇవి చిరంతన రత్నాలుగాసాహిత్యంలో నిలిచిపోగలవు వచనం నోట నిలువదు, నిలవాలంటే ఛందంలో బిగించక తప్పదు' నేను కవులందరినీఅడుగ తూనేఉంటా- యతి ప్రాసలు వారిని ఏనాడూ అడ్డుపెట్టి ఎరుగవు. చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఒక ఛలోక్తిని విసరేవారు : గద్య కవితా చతురునితో శాస్త్రి అనేవారు : "నాకంటే

నీవే గొప్పవాడివి; యతులు గణాలను సడలించుకోగలిగినావు. ఆ పని నా చేత గాకున్నది. కలమెత్తుకుంటే అవేముందువచ్చి కూర్చుంటవి' అని.

సోమసుందరంగారి ప్రవేశిక విసయంగూడా రమ్యంతగొప్పాల. కారణ విమర్శకశక్తికి పట్టాభిషేకం చేసిన ఆ కట్టమంచి రామలింగారెడ్డిగారివలె, వీరూ పాఠకునికి పనికివచ్చే ఎన్నో విషయాలను ప్రస్తావిస్తారు - తమ ప్రవేశికలలో. "త్రోవలరయు నవకుమారులకు నీవు తోడుగావలయు రామలింగావతంస" అని రాయప్రోలు మహాకవి కట్టమంచివారిని కోరి ఉండినారు. అట్లే సోమసుందరంగారు ఒక శిష్య బృందానికి తల మనిషిగా ఉన్నట్లున్నది. ఈ సంపుట విషయాన్ని ఏరికూర్చి రూపొందించినది ఈయనేకాబట్టి, కవితోబాటు ఈ సహృదయ విమర్శకునిగూడా చాపకూడు (సపంక్తి భోజనం) పెట్ట వలసినదే! బెర్నార్డ్‌షా సొంతంగా ఉపోద్ఘాతాలు వ్రాసుకొనేదాని కంటె ఇంకొకరు వ్రాయడం మంచిపని. రచయిత యీ గ్రంథంలో ఎంగిలి ముక్కలు లేవంటూ, నేటి తెనుగు గ్రంథ ప్రచురణను బాగా పొరబట్టినారు. పూర్వం రామభూషణుడు కుకవిని 'సామాన్యాకృతి' గా ఏకినాడుగదా! సిగ్గు లేకుండా ఒకడి వ్రాతలను, కథలను - శీర్షికలకు పాత్రలకు పేర్లుమార్చి అదేపత్రికకు పంపే బయిసిమాలిన లీరు తెనుగుజాతిది లోకాన్ని మలిన పరచక ధర్మాల పునర్మీలనం చేయడమే కవిపని అన్నది పరమసత్యం. దీనిని ధైర్యంగా చెప్పినారు. కవిపేర కావ్యం రావడం మనకు వాలాయమేగదా - మాఘం, భారవి, వేమ కవిచౌడప్ప, గువ్వల చెన్నుడు మొదలైనవి. 'ముతిర' పదానికి అర్థం శబ్దరత్నాకరంలో లేకపోయినా. ఇతర నిఘంటువులలో-స్త్రీ-కానుకి అనే అర్థాలున్నవి. ఈ సందర్భంలో ఇది సరిపోతున్నది.

సరే! ఏరుమంచి చదువరులుగదా-సొంతానికి స్వంతంలని, గాథను గాధ అని, యథార్థాన్ని యదార్థమననేల? స్పెలింగు తప్పును నింద్యగ్రామ్యంగూడ ఒప్పుకోదనుకొంటా.

**—శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి**

# ని శాం త ం

[గ్రంథకర్త : ఆర్. ఎస్. సుదర్శనం. ప్రకాశకులు-ది ఇండియన్ లాంగ్వేజస్ ఫోరమ్. గోషామహల్, హైదరాబాదు 500012. క్రౌను 22+44 పే. ద్వితీయ ముద్రణ, మార్చి 1976. మూల్యము రు. 3. దొరకుచోటు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ 3237. రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాదు.]

సుప్రసిద్ధ విమర్శకులూ, సాహిత్య తత్త్వవేత్తలూ, సవలా కారులూ అయిన ఆర్. ఎస్. సుదర్శనంగారు రచించిన ఏకైక రసవత్తర పద్యకావ్యం 'నిశాంతం'.

కాలచక్రంలో మనకు నిత్యమూ తటస్థపడే విదివారాత్రాలు. రాత్రి నిద్రావస్థకూ, పగలు జాగ్రదావస్థకూ ప్రబల నిదర్శనాలు. అజ్ఞాన తిమిరానికి నిప్పంటించి, మానవ మనుగడ అనే జ్ఞానోదయానికి నాంది పలికేది ఉషోదయం.అదే 'నిశాంతం'నిద్రావస్థితిలోనున్నజీవి క్రమపరిణామంతోచైతన్యవంతమై అన్నమయ,ప్రాణమయ,మనోమయ విజ్ఞానమయ, ఆనందమయ కోశాలనే సోపానాలెక్కి మోక్ష సామ్రాజ్యాన్ని పొందగోరడమే నిశాంత కావ్యసారం. అదే జీవాత్మ పరమాత్మను జేరటమనే పరమార్థం. 'బంధితుడు' ఇత్యాదిగాగల 24 శీర్షికలలో చివరిది 'నిశాంతం'. దీనినిబట్టి ఈ కావ్యానికీపేరు పెట్టబడింది. కర్మబద్ధుడైన ప్రాణి పరిణామక్రమంలో జీవన్ముక్తుడగుట అనే నిత్య సత్యాన్ని ఈ శీర్షికలక్రమం తెలుపుతున్నది.

'ఇది ధ్యానకవిత, నేను నాకై వ్రాసికొన్న కవిత. ధ్యాన వస్తువు ఆత్మానుభూతి. ప్రతీకలద్వారా అభివ్యక్తి' అని కవి లవతారికలో తెలిపినారు. అంటే ఈ కావ్యం ఆత్మాశ్రయ తత్త్వానికి (subjective) చెందిందనీ, విషయం వాచ్యంగాకాక వ్యంగ్యంగా తెలుపబడిందనీ వేరే చెప్పనక్కరలేదు.

పద్యాన్ని సంగీత వాతావరణంలోకి తీసుకురావడానికి చేసిన ప్రయత్నమే ప్రతీకవాదం (Symbolism) పుట్టుకకు కారణమయింది. ఫ్రెంచి కవులు బాడెలెయిర్, వెర్లేన్. మలార్మే దీనికి ప్రతినిధులు. సంగీతంలోరాగం భావాన్ని వ్యంగ్యంగా సూచించినట్లే కవిత్వంలోని ప్రతిశబ్దమూ సూచ్యార్థ ప్రధానంగాఉండాలనేది ప్రతీకలక్ష్యం.

ప్రతీకలు కవికి కలిగే అనుభూతినిబట్టి ఉంటాయి. అనుభూతికి అనుభవం ప్రధానం. ఈ కావ్యంలో ప్రతి శీర్షిక కవికి గలిగిన అనుభూతికొక ప్రతిబింబం. అందుకే 'ఇది ఒక యనుభూతి కావ్యము. ఒక వ్యాఖ్యాన కావ్యము. ప్రకృతి రహస్యములకు సర్వజగద్రహస్యములకు నొక భాష్యమువంటి కావ్యము' అని 'మున్నుడి'లో శ్రీ విశ్వనాథ వ్యాఖ్యానించినారు.

మొదటి శీర్షిక 'బంధితుడు' జీవి నిద్రావస్థితికి ఒక ప్రతీక. పిపీలికాది బ్రహ్మపర్యంతాన్నీ ఒక 'కాలసర్పం', 'చోదకత్వము వహించుమూర్తి' ముందు వెనకల బంధించి నడిపిస్తున్నాయి. అందుకే జీవిస్వేచ్ఛకోసం పరితపిస్తున్నాడు. పూర్వజన్మాంతర వాసనలు 'మరపు తెరల వెనుక' నుంచి దోబూచులాడే స్థితినుండి జీవుడెప్పుడూ విముక్తికోసం ప్రయత్నిస్తూనే ఉంటాడు. అందుకే కవి

'వెలుగు శాంతినవఘలించు స్వేచ్ఛవలయు' అని ఆకాంక్షిస్తాడు చివరలో.

అయితే సుదర్శనంగారికి తన ప్రేయసీ 'దృగంచలాలే' వెలుగు నీడలూ, ఉభయసంధ్యలు. ఆమె చూపుల తూపులతో నిశాంతమున మేల్కొని చైతన్యాన్ని పుంజుకున్న కవి దివసాంతానికి నిస్పృహలోపడి నిద్రలో మునుగుతున్నాడు. అంటే ఆ జగన్మాధుని మాయాజాలానికి భ్రమించి, పరిభ్రమించి విసిగి వేసారి, మూలతత్వాన్ని కనుగొనలేక జీవుడు మళ్ళీ నిద్రావస్థితిని పొందుతున్నాడు ఇదే బతుకును ఒక ఊయెలతో ఉపమించడంలోని తాత్పర్యం.

ప్రకృతిని కాంతారూపంతో వర్ణించడం కవుల కాచారం భావ కవులు ఆమెను తమ ఊహాసుందరిగా భావించి ప్రకృత్యారాధన చేశారు.

కవి ఏకాంతంగా ఉన్న సమయంలో ప్రకృతి ఓ కాంతా రూపంలో కన్నులముందు నిలచి, 'తీయని తలపులతో స్పృశించి' ఎప్పుడూ 'తీయని ఎద తలుపులను' తెరిచింది. దాంతో బతుకనే కొబ్బరికాయ కొట్టి, వలపు కొబ్బరినీళ్ళతో కాళ్ళు కడిగి తన ఆత్మనే కర్పూరహారతిగా వెలిగించి ఆమెను ఆరాధించాడు కవి.

కాని ఈ నిర్వ్యాజమైన పూజకూడా మనశ్శాంతి నీయలేదు. తాపత్రయాలలోబడి కొట్టుమిట్టాడాడు కవి. నిశాంతమైనా అహస్కరుడు 'తిరస్కరించిన కారణము' తాను 'ప్రకృతి దేవ్యాలయార్చక పదవి గొనుట'యేమోనని సందేహించాడు. ఈ కవితలో జీవుని ఆర్తి వినిపిస్తుంది. ప్రకృతి పూజఅంటే ఆ పరాశక్తి పూజే!

కవి ప్రేయసి ప్రకృతి పుత్రిక అయిన వేదవతి. పూతచరిత. 'ఆమె రాగమువకు స్థాయి అంబరమ్ము'. రాగమనే పదానికి కాంతి విశేషమనీ, అనురాగమనీ, సంగీతంలోని కొన్ని స్వరముల సమ్మేళనిమనీ శ్లేష. ఏమయినా రాగానికీ, అనురాగానికీ స్థాయి చాలా అవసరం. అది తప్పితే రసాభాసమే!

ఆ వేదవతియే 'ప్రణయ దుగ్ధపాథోనిధి దలుచువేళ లక్ష్మియై, సీతయై, చివరకు 'విశ్వమానవ కల్యాణ విలయ' కాలంలో ఆదిశక్తియైన పార్వతిగా రూపొందింది. ఇందు శివ శక్త్యాత్మకమైన 'ఆ పరాశక్తి త్రిదశలు కుమారీ, యోషితే పతివ్రతా' అనేవి సూచింపబడ్డాయి.

సుదర్శనంగారు ఆ త్రిమూర్త్యాత్మకమైన కాంతివిశేషాన్నే 'ఆదర్శజ్యోత్స్న' అన్నారు.

ప్రేయసి పొలయలుక వహించింది. కవి మూర్ఛంగా ఊరుకున్నాడు. దాంతో 'వలపువశనపయింది. ప్రేయసీ ప్రియులు అలిగినా నలిగినా తెల్లవారటం అగిదుకదా!

'సిగ చెదరి రాలె పూవులు
గగనములకబూవి, మోము క్లాంతమ్మై భూ
మి గరువపు సెగలతీగెను
పొగ చూపెను సంజయెఱుపు, ప్రొద్దును పొడిచెన్

తన ప్రేయసికీ, ప్రకృతికీగల పోలికలను ప్రతీకల ద్వారా కవి వ్యక్తం చేశాడు ఈ పద్యంలో. ఇదియే 'అల్పాక్షరములలో అనల్పార్థ రచన.'

అసలు, జీవి పుట్టింది మొదలు మరణించేవరకూ ఎడతెగక కొనసాగేది అన్వేషణ. అదే 'నేను'లోని అంతరార్థం తెలుసుకోవడం కోసం చేసే ప్రయత్నం. 'నేను' అనేమాట ఈ జీవుడు అనడంలో ఒక విశేషముంది. ఈ జీవాత్మ ఆ పరమాత్మయొక్క స్వరూపం. అంటే ఈ జీవపదార్థం ఆ బ్రహ్మపదార్థంయొక్క అంశమన్నమాట! ఆ పరమాత్మ తత్వమే సుమా 'నేను' అని చెప్పడమే 'నేను'లోని పరమార్థం. అది తెలియక మానవుడు మూఢుడుగా ప్రవర్తిస్తున్నాడు. 'దానికదే గమ్యమైన స్వతంత్ర్యసిద్ధి'యే అహం బ్రహ్మాస్మి' అనే స్థితి. అదే జీవి కొనసాగించే అన్వేషణ. ఇది ఒక జన్మలో సాధ్యం కావచ్చు, కాకపోవచ్చు. అది తెలుసుకునేంతవరకు ఎన్ని రూపాలైనా పొందవలిసిందే! ఇదే జన్మ రహస్యం.

ప్రతి మాటకూ కొంత పరువు, బరువు ఉన్నాయి వాటిని తెలుసుకొని మాటల్లోని సారాన్ని పిండటమే కావ్యశిల్పం. ఏమాట ఎక్కడ ఎలా ప్రయోగించాలో తెలిసినవాడే కావ్యశిల్పి. ఆంగ్లాంధ్ర భాషలలో అవర్ణళమైన పాండిత్యమున్న సుదర్శనంగారికి ఈ రహస్యం కరతలామలకం.

'నీ వలుకజెందుట మెరుపు తీవతళుకు
నీ వనుగ్రహించుట మబ్బునిండుతనము
నీ నరస భాషణము పన్నీటి జల్లు
నీ వలపు శరద్రాత్రి వినీలనేత్ర.'

ప్రకృతితో తాదాత్మ్యము చెందుతూ ప్రేయసిని స్మరించడం కనిపిస్తుంది ఈ పద్యంలో.

ఇటువంటి పద్యాలే సత్యనారాయణగారికి తమ 'గిరి కుమారుని ప్రేమగీతాలు' జ్ఞాపకానికి తెన్నిచాయి. సుదర్శనంగారు కూడా శ్రీ విశ్వనాథ వలెనే 'దేవి'ని మాతృస్వరూపిణి (ఎల్లళ్లయూడి 'అమ్మ')గా, ఈశ్వరిగా భావించుకొన్నారు.

సుదర్శనంగారు ఒక మహాకవేకాదు, గొప్ప తత్వవేత్త కూడా అని నిరూపించుకున్న ఈ కావ్యాన్ని పఠించటం అవశ్యకర్తవ్యం అని పాఠకలోకానికి మనవి చేస్తున్నాను

— శ్రీ శివలెంక ప్రకాశరావు

# మరో వసంతం

[(నవల) రచన: వాడపల్లి అనసూయాదేవి. వెల: రు 4 పుటలు : 114. ప్రచురణ: సారస్వతమేఖల మహబూబాబాద్. ప్రతులకు : దత్తాత్రేయ ట్రేడర్సు, సంజీవరెడ్డి భవన్, ఖమ్మం ఆం. ప్ర]

ఇటీవల ఖమ్మంలో జరిగిన రాష్ట్ర రచయిత్రుల మహాసభల సందర్భంగా ఆవిష్కరింపబడిన నవల ఈ "మరోవసంతం". నేటి నవలా నిర్మాణంలో రచయిత్రులు చూపిస్తున్న అభినివేశం, ఆసక్తి వర్ణనాతీతాలు. వారా పరుగు పందెంలో రచయితలనుగూడ వెనక్కునెట్టివేసి సబలలనిపించుకుంటున్నారు కూడ. అయితే వారిలోని చాలమంది రచనల్లో సంఖ్యా బాహుళ్యం పెరిగినంతగా సాహితీ జీవిత వైవిధ్యం పెరగటంలేదనేది సహృదయులకు గోచరిస్తుంది. నవలలు పదేపదే చదివి పదింబదిగ నవలలు వ్రాయాలనే వారుత్తమ నవలా స్రష్టలు కాలేరని విజ్ఞుల పలుకుబడి. దానివలన అనుకరణాజాడ్యం పెరుగుతుందేతప్ప స్వీయవ్యక్తిత్వంతో గూడిన సృజనాదక్షత స్వల్పమవుతుంది. ఈనాటి పెక్కు నవలలు ఆ విలక్షణ మాతృకలకు ప్రతికలని కటువుగా వున్నా చెప్పక తప్పదు.

ఆదృష్ట్యా పరిశీలించిచూస్తే, ఈ నవల రచయిత్రి ప్రథమ ప్రయత్నమైనా నిర్మాణ దక్షతలో ప్రధానమైనదిగానే కన్పించటం ముదావహం. ఈమెకు జీవిత గమనంపట్ల వున్న ఖచ్చితమైన అభిప్రాయాలు, కొందరు రచయిత్రులలో గోచరించే అకారణ పురుషద్వేషం లేకపోవటమే యీ నవలకు సమదర్శనాన్నిచ్చి సమున్నత స్థానం యిస్తుంది. ఇందులో యెన్నుకోబడిన యితివృత్తం స్త్రీలకు పరిమితమైనదిగా గోచరించినా, తదాలంబనమైన పురుష ప్రపంచ ప్రవృత్తి ప్రవృత్తులనుగూడ సమగ్రంగా యివ్వబడింది.

నేటి సామాజిక గతుల బంధాల్లో చిక్కుకొన్న ముగ్గురు మగువల జీవిత విలువల కథనం యిది. శైలజ, నీరజ, రజని అనే స్నేహితురాండ్రు జీవన సమరంలో సాధించిన జయాపజయాల వివరణ యిందులో ప్రధాన వస్తువు. ఈ ముగ్గురిలో కథానాయిక శైలజ సాంప్రదాయిక స్త్రీత్వానికి ప్రతీక. తప్పుదారిలో పడిన భర్తను పరివర్తింపజేసుకొని, విజ్ఞతతో వర్తిస్తుందే తప్ప విధివ్రాత అని లొంగిపోయి, రజనిలా ఆత్మార్పణ గావించుకోదు. అకాలమృత్యువాత బడిన నీరజ మరణంతో మనసును పంచుకొనే మిత్రురాండ్రు లేకపోవటంతో ఏకాకియై, చిత్త సంక్షోభానికి చిక్కిన శైలజపాత్ర సంప్రదాయ ప్రాతిపదికపై కాలూని అభ్యుదయ చేతనావరమైన అధునాతన స్త్రీ ప్రవృత్తితో మేళవింపబడి సుఖాంతం చెందుతుంది. రచయిత్రి యిచ్చిన పాత కొత్తల మేలు కలయికల స్త్రీత్వాల పరమార్థపు తీర్పు అత్యంత హృద్యంగావుంది. ఈ నవలలోని మరో స్త్రీ నవల పాత్ర చాలా ఆలోచనాత్మకంగా సుద్దేశింపబడింది. సంఘపు కట్టుబాట్లలో మోడువారిన జీవితాన్ని మరో వసంతం చేసుకునే తెగువ గల మగువగా ఆమె చిత్రించబడితే, అదే దశలోని మరో బలి పశువు అయిన మరో అమ్మాయి ఆలోచనవుండి కూడా ఆవేశం, ధైర్యస్థైర్యాలు లేక జీవితాంతం రాజీపడే ధోరణి గల విధి వంచితగా, విచిత్రంగా చిత్రితమైంది. విభిన్న మనస్తత్వాలతోగూడిన యీ తరుణుల కరుణారసభరిత జీవితాల వెతలు చక్కని జీవిత వైవిధ్యాన్నిస్తాయి.

ఈమె వర్ణనలలో సహజత్వం, సరళమైన శైలి శోభాయుతంగా వుంటుంది. అకాల వార్ధక్యం వాళ్ళిద్దరి జీవితాలను ఆక్రమించి, అన్నిటా ఓటమిని చూపిస్తున్నవి' వంటి భావోద్వేగమైన భాష పుష్కలంగావుంది. విధి చెయిదాలకు తలవొగ్గే సంప్రదాయ తత్వం, పురుషుని అన్యాయాలకు తాళికట్టిన మాత్రాన సహింపరాదనే అధునాతన చేతన రచయిత్రి మనసునింకా కల్లోల పరుస్తున్న కారణంచేత కాబోలు పరిష్కారం చెప్పవలసినంత పటిష్టంగా వుంపలేదు. నిర్మయంగా, మెల్ల మెల్లగా, టిఫిన్ చేయమని అర్థరివ్వటం వంటి భాషాదోషాలను, పురుషుడు స్నానం చేస్తున్న గదిలో పరవనిత పున్నట్లు చెప్పే అసహజ సన్నివేశాలను రచయిత్రి తమ 'మరి వసంతాల'లో సవరించు కొంటారనుకుంటాను.

ఈ వర్ధమాన రచయిత్రి మరిన్ని నవలా వసంతాలతో తన నవలా రచనా జీవితాన్ని సపరసపరితంచేసుకొని, యథాశక్తి మహిళాలోకాన్ని యింకా మేలుకొల్పుతారని ఆశించవచ్చు.

# స్మృతి

[(నవలిక) రచన. అక్కల సరస్వతి బాబూరావ్ వెల: రు 4-00పుటలు : 81.]

ప్రచురణ : స్పందన సాహితి సమాఖ్య, 23/182 ఇ. న్యూ మున్సిపలు క్వార్టర్సు, మచిలీపట్నం.

తెలుగు పలుకుబడికి పట్టంకట్టిన రచనలను ప్రచురించి, సహృదయ రసస్పందన నిస్యన్న స్పందన సాహితీ సమాఖ్యవారి మరో వికసిత కుసుమం ఈ స్మృతి నవలిక. వాస్తవానికిది నవల కాదు. తేటరుదుగా వస్తున్న మానసిక మథనమనే వినూత్న ప్రక్రియ నవ్యత, రమ్యత సమస్థాయిలో నిలబెట్టబడిన యీ గ్రంథంలో జీవిత సంద్రంలో ఆటుపోటుల నెదుర్కొని విషపీయూషాలను సమంగా ఆస్వాదించిన ఒక మనిషి అంతరంగ విశ్లేషణం అగ్రపంతంగా యివ్వబడింది. అందులోంచి జాలువారే అమృత నిష్యందినిని రచయిత్రి తన ప్రతిభా చాతుర్యంతో పాఠకులకు పంచిపెట్టారు.

ప్రత్యూషకాలంలో, ప్రశాంత వాతావరణంలో అలలు అలలుగా సాగిన వృద్ధుడైన కథానాయకుని ఆలోచనా స్రవంతి గతజీవితపు వన్నె చిన్నెలతో, గార్హస్థ్య జీవితంలోని నవతా మమతలతో, ఆశావాదాన్ని, ఆత్మీయతను రేకెత్తించే విధి చెయిదాల సన్నివేశాలతో, కాలగర్భంలో కరిగిపోయిన అర్ధాంగి మధుర స్మృతులతో, పండుటాకులతో మిగిలిపోయిన జీవనవృక్షాన్ని గతస్మృతులతో నిలబెట్టుకోవాలనే ఆ వృద్ధుని విరహ సుఖాన్ని కళ్ళకు కట్టించారు రచయిత్రి. ప్రాతఃకాలంనుండి నిశీథివరకు నడిచిన యీ వ్యక్తి ఆలోచనా స్రవంతి వెలుగునుండి చీకటికి చేరటంతో అంతమవుతుంది. అదే యిందులోని పటిష్ఠమైన ప్రతీకాత్మకత. భౌతికంగా చీకటి చేరినా, ఆంతరంగికంగా వెలుగును పొంది, తన్ను దేవుడనుకునే తనవారి నీడకు చేరాలనే అభివ్యక్తి ఈ వ్యక్తికి యేర్పడటమే దీనికి ముగింపు.

"ఘనతమీరి వున్నారు ఘనులు ఘనులైన కొమాళ్ళు" అనే కామాక్షి జానపద గేయంతో తెరజారిన ఈ దృశ్య కావ్య ప్రదర్శనంలో ఆ కొమాళ్ళ దగ్గరికి చేరదలచిన ముసలితండ్రి మనసును ఆగేయం సాభిప్రాయంగా ఆమ్రేడిస్తుంది. ఈ నవలికలో కొన్ని అధునాతనాంగ్ల నవలల ఛాయలు కొన్ని గోచరిస్తాయి కాని అవి దీనికి బలుపుగానే వుంటాయి. రచయిత్రి ప్రకృతితో పరవశించి పాడుకొంటున్నట్టున్న వచన గీతాలు యిందులో పాఠకులకు సహానుభూతిని కలిగిస్తాయి. మేలి ముసుగులా కప్పిన పిల్లని మంచు, గోడల కల్లుకున్న సన్నజాజి సున్నిత సౌరభం, నీలాకాశంలో మెరిసే చుక్కలు – నవలా పఠనంలో పాఠకునికి మోద కల్పిస్తాయి. "క్షమ అనేది స్త్రీకి కవచం లాంటిది" అనే మాట గమ్యం తెలియకుండా గంగవెల్లువలెత్తే అతి తెలివిగల వనితల వాక్ప్రవాహానికి ఆనకట్టలాంటిది. అంతే కాదు, జీవితంలోని వైరుధ్యాన్ని, వైవిధ్యాన్ని విప్పిచెప్పే యిలాంటి నవలలు 'ఫార్ములా' నవలలకు చెంప పెట్టులుకూడ సామాన్యుడికి జీవిత పాఠాలు, గుణపాఠాలు నేర్పగలిగినవి నవలలో. ప్రేమించటంకన్న ప్రేమింపబడటం మిన్న అనేది యీ గ్రంథం యిచ్చే అందమైన సందేశం అటివారికే జీవితం 'వడించిన విస్తరి'. సంపెంగల సుగంధ సౌరభం వంటి సరోజ పాత్ర ముని మాణిక్యం వారి కాంతాన్ని స్ఫురణకు తెచ్చే మరో తెలుగింటి ఆడబడుచు

నవలా రచనల్లో నాణ్యమైన స్థానాన్ని సంపాదించిన రచయిత్రి సినిమా వ్యామోహానికి కారణాన్ని స్పష్టంగా తీర్పు చెప్పక సందిగ్ధంగా వుంచవలసిన పనిలేదు. అలాగే పౌరాణిక వ్యక్తులను గూర్చిన వీరి ధర్మ నిర్ణయాలు చాలమందికి ఆసక్తి కల్గించకపోవచ్చు. మన మేధాశక్తి కలితమైన అధర్మ సాక్ష్యాల జోలికి పోకుండటమే మంచిది మాప్. నవలలను వీరు పరిశీలించిన తీరు తెన్నులు మతి ప్రతిభా చాతుర్యానికి మచ్చుతునకలు.

ఊహాపోహలతో, కటు కథలతో పాఠక ప్రపంచాన్ని ముంచెత్తుతున్న యిటీవలి నవలా ప్రభంజనంలో ఈ 'స్మృతి' మంగళ మయ నిలమైన మనసులను రంజింపజేస్తుంది. అంతేకాదు. తెలుగువారి శాస్త్రీయమైన మానసిక భావుకతకు పురోగమనానికి దృష్టాంతం అవుతుంది. నవలా రచనల్లో కాలాని కనుగుణంగా మనమూ జాగ్రత్తగా అడుగులు వేస్తున్నామని యిలాంటి నవలలు చదివినప్పుడు అనిపిస్తుంది

## వీరకంపరాయ చరిత్ర మను శ్రీ మధురావిజయము

[రచన : శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి (పద్యకావ్యము) ప్రచురణ : సాధన గ్రంథమండలి - తెనాలి పుటలు : 104, వెల: రు 5 00.]

ఆ పాత మధురమూ, ఆలోచనామృతమూనయిన ఆంధ్ర సాహిత్యాన్ని ప్రబంధరీతిలో ఛందోబద్ధంగా అందించే కావ్యాలు నానాటికీ అరుదైపోతున్నాయి అట్టి యీ రోజుల్లో శ్రీ శాస్త్రి

గారిచే సంప్రదాయ సౌందర్యాన్ని పుణికి పుచ్చుకున్న పోకడలో ప్రవచింపబడిన ఈ కావ్యం రసజ్ఞుల పాలిటి పన్నీటిజల్లు అని చెప్పవచ్చు. దీన్ని యీవరకు వచనంలో పేరాల భరతశర్మగారి వంటివారు చెప్పినా, వారు చరిత్ర ప్రాధాన్యాన్ని దృష్టిలో వుంచుకున్నారు. విజయనగరాధీశుడగు బుక్కరాయల కోడలు, కంపరాయల ధర్మపత్నియైన విదుషీమణి గంగాదేవి గీర్వాణ భాషలో రచించిన గ్రంధానికిది తెలుగుసేత. అందలిరసవంతమైన శైలి కప్పురుపోకుండ తాను తెన్గీకరించానని వీరు చెప్పుకున్నారు. గురువర్యుల కంకితమిచ్చి ఉత్తమ శిష్యులనిపించుకున్నారు. మూల శైథిల్యాలు గూడ రసోచితంగా పూరించానని చెప్పుకున్నారు.

ఇది మూడాశ్వాసాల ముచ్చటైన గ్రంథం. ప్రబంధంలోలాగే శృంగారవీరరసాలిందులో సంతరించబడ్డాయి. శ్రీనాథుని "నూనూగుమీసాల" సీసపద్యం ఫక్కీలో రచింపబడ్డ వీరి గురుస్తుతి గణనీయంగా వుంది. గురుస్తుతినే యిష్టదేవతా స్తుతిగ భావించిన పిమ్మట కాళిదాసకవి "వాగర్థావివ" శ్లోకాశ్లేషంతో వాగీశ్వరీ స్తోత్రాన్నాలపించారు. ప్రబంధ కావ్యాల్లోలాగానే యిందులోను పూర్వకవితాస్తుతి, కుకవినిరాసనము, షష్ఠ్యంతములు చెప్పబడ్డాయి. నాటి కాళిదాసునినుండి నేటి విశ్వనాథువరకు కవులు వీరికి స్తుతిపాత్రం అయినారు. "విశాంకావ్యాభిరుశీలన వశాత్ విశదీభూతే మనో ముకురే" అన్న యాభాణవానికి ప్రతిబింబంగా శాస్త్రిగారి కవితామూర్తి గోచరిస్తోంది. చతురమగు శబ్దము, సుశబ్దము, భావరమణీయమ్మైనమైన కావ్యాలు నేడు కానరావని, సారలలిత వాక్సుధారసతరంగాలైన కవులు లేరన్న వీరి యావేదనయే వీరి కావ్యంలోని భంగ్యంతరమైన కువిమెంద.

అనువాద గ్రంధమైనా యిందలి రచన ధారాశైలితోగూడి స్వతంత్ర కావ్యంలాగ భాసిస్తోంది. "స్వాదు పుష్పరసాస్వాదే: ప్రేరయతి షట్పదాన్" అన్న మూలశ్లోకాన్ని "సత్కవుల బాణి వినం బ్రతిమాలినేల యొక్కండెడిన కొల్పునే యళులంగమ్మని పూవులం దేనె లానగారండని" అని మనోహరంగా అనువదించారు. సూటిగా నాయక ప్రశంసలో బుక్కరాయల గుణవిశేషాలను వర్ణించిన పద్యాలు శాస్త్రిగారి ప్రౌఢశైలీవిన్యాసానికి, సంస్కృత భాషాభిజ్ఞతకు ప్రతీకలు.

శా. వైరి ప్రాణ సమీరణాశనుఁడు దుర్వార ప్రకుంఠైనయే
 ఘీరోత్తం సుభుజంగమైన యసికీర్తిం గణుకంబాప్పె వి
 స్తారంబై యదె సద్గుణోల్లసితమౌ ధాత్రండ భాండంబు నిం
 డారంగ గన్పెడు కూలచోలమున గాఢస్ఫూర్తి నిర్వ్యాధగాన్

బుక్కరాయల కీర్తివైభవానికి సమానాంతరంగా విజయనగర పురీ వర్ణనను సంభావించి సద్యోహృద్యం చేశారు రచయిత. ప్రథమాశ్వాసంలో బుక్కరాయల తనూజుడైన కంపరాయలమగటిమిని గూడ తెల్పి, తండ్రి ప్రోద్బలంతో ఆతని జైత్రయాత్రావమారంభాన్ని ప్రశంసించారు. ద్వితీయాశ్వాసంలో జైత్రయాత్రా ప్రాంతాలను, ప్రకృతికాంత కాలి యందెల రవళిలో మేళవించి వినిపించిన మధురగీతికోకొల్లలు. వీరశృంగారమూర్తిగా కంపనను చిత్రించిన తీరుతెన్ను సహృదయ నైవేద్యంగా వున్నాయి. శాస్త్రిగారి రసోచిత వర్ణనా వైదగ్ధ్యానికీ చిన్న పద్యం మచ్చుతునక.

 కైతకాంచిత గిరిమల్లికా సుగంధ
 బంధుర సమీరణంబులు ప్రకటరత్న
 సౌధతలములు ప్రచలాళి సమదకూజి
 తములు స్మరదీపకములయ్యె ధరణిపతికి

"సద్గురు మదదోయుక్తి ననుకూలురు చిత్తములొగ్గుగస్తు కదంబకమున" అన్న వర్ణన శాస్త్రిగారి ఆలంకారిక, లోకోక్తుల సమ్మిశ్రితం చేసిన వ్యక్తికి తార్కాణాలు

వీర శృంగారాలను విశిష్టంగా కైవసం చేసుకున్న కంపరాయల భుజబల ప్రాభవం తృతీయాశ్వాసంలో కొనసాగించబడ్డది. యవనుల యేలికలోని మధురానగర మాలిన్యమంతా ప్రత్యక్షరం అతనికు ప్రత్యక్షం గావింపబడ్డ తదుపరి కంపరాయలు ఉత్తముడైన రాజా గనుక సామనీతిని యత్నించి, విఫలంకాగా,

శా॥ ఆ కర్ణాటకుల ప్రదీపుడు వదాన్యప్రౌఢి సాహ్యంబునన్
 పీకన్వచ్చు విరోధిచేతి యసిసంవేగంబు వంచించి స్వ
 ప్రాకట్యంబు సుతిష్ఠితింప నిమిషార్ధం బందుఖండించె
 శ్రీ కంచా యవన ప్రధాను శిరముంజేకొన్న దివ్యాసినిన్

అన్న పద్యంతో దుష్టశిక్షకుడై మధురను తన యధీనంలోనికు వైనం రసవంతంగా తెల్పబడింది. సమస్త భూప్రజకు ఆనందాన్నిచ్చిన ఆతని చరిత్రను గంగాదేవి అక్షర ప్రాయం చేసిం దాన్ని ఈ శాస్త్రిగారు సర్వజన మనోరంజనంగా అందించారని చెప్పాలి. తన పాండితీ ప్రకర్షకునిక లోపలంగావుంటుందన్న భావనకాబోలు కొంత వర్ణనా ప్రియత్వంయిందులో యెక్కువగా గోచరించి కథాగమనాన్ని తగ్గించింది. సంగ్రహంగా చెప్పబడిన కావ్యం నప్పటికీ అష్టాదశ వర్ణనాత్మకమైన ప్రబంధంలాగ భాసిస్తోంది.

విద్వత్కవులైన శాస్త్రిగారింటి కావ్యాలనిబ్బడిముబ్బడిగా గూర్చి ఆంధ్రశారదనలంకరింపజేస్తారని ఆశించవచ్చు. సాంప్రదాయిక సాహితీలత కిట్టి సహృదయులే ఆధారాధేయాలవుతారు.

— "సుమంత్ర"

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.